LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.nellore.com

# జమీన్ రైతు





స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 12 | 17.3.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి: రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# చంద్రబాబు అవమానించినా జనం దీవించారు!

నెల్లూరు మునిసిపల్ ఎన్నికలలో తెలుగుదేశం అభ్యర్థిని శ్రీమతి తాళ్లపాక అనూరాధ అనూహిత మెజారిటీతో గెలుపొందారు. కాంగ్రెస్ అభ్యర్థిని డాక్టర్ పి.యశోధర కంటే ఆమెకు 11,760ఓట్ల ఆధిక్యత లభించింది. దీన్ని తెలుగుదేశం గెలుపు అనడం కంటే రమేష్‌రెడ్డి వ్యక్తిగత విజయం అనడం సముచితం. మంత్రి ఆదాల ప్రభాకర రెడ్డి బలవంతం వల్ల అనూరాధకు టిక్కెట్ అయితే ఇచ్చాడు కాని - ఆమె ఎన్నికల్లో నెగ్గుక రావడం చంద్రబాబుకు ఎంత మాత్రం ఇష్టం లేదు. నెల్లూరు సభలో తన అంతరంగం స్పష్టంగా బయటపెట్టారాయన. రమేష్‌రెడ్డితో తిరిగితే చెడిపోతావు జాగ్రత్త అని హెచ్చరించడం తోపాటు, ఆమెకు ఓటు వేయడం తగదని పరోక్షంగా ఓటర్లకూ సూచించారు కూడా!

సాక్షాత్తు ముఖ్యమంత్రి ఆ సూచన చేయడంతో తెలుగుదేశం అసమ్మతి వాదులకు పట్టపగ్గాలు లేకుండా పోయాయి. పబ్లిక్‌గా, పచ్చిగా సైకిల్ గుర్తుకు ఓటేయద్దని ప్రచారం చేశారు వారు. జిల్లా పార్టీ యంత్రాంగం నుంచి రమేష్‌రెడ్డికి ఏ మాత్రం సహకారం లభించలేదు. మాజీ మంత్రులు చంద్రమోహన్‌రెడ్డి, నల్లపరెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి వంటి వారు ఎన్నికలు ముగిసే వరకు టౌన్‌లో తమ ముఖమే చూపించలేదు. ఇన్ని ప్రతికూలతల మధ్య రమేష్‌రెడ్డి సతీమణి పదవి గెల్చుకున్నారు. అందువల్లే ఇది పార్టీ విజయం కాదు - రమేష్‌రెడ్డి వ్యక్తిగత గెలుపు అనడం! ప్రజలు కేవలం పార్టీని పట్టించుకొని వుంటే గూడూరు, కావలిలలో తెలుగుదేశం అంతటి ఎదురుదెబ్బ తిని వుండేది కాదు. ఒకే జిల్లాలో రెండు రకాల ప్రజా తీర్పులు రావు కదా? పైగా ఆ రెండు పట్టణాలలో పార్టీ తరపున ఎన్నికల ప్రయత్నం చాలా ఏకధ్యంతీగా జరిగింది.

ఇంతకూ రమేష్‌రెడ్డిని ప్రజలు ఎందుకు అభిమానించినట్లు? ఆయన పేరున్న రాజకీయ నేత కాదు; కుటుంబ నేపథ్యం లేదు; ఆర్థిక బలం లేదు; ప్రాణాలిచ్చే అనుచరవర్గం లేదు; రాజకీయ

## అనూరాధ గెలుపు రమేష్ విజయమే

టక్కుటమార విద్యలలో నైపుణ్యం లేదు; ఏ బలమైన వర్గం ప్రోత్సాహమూ లేదు. అయినా అంతగా బలపడ్డాడంటే కారణం - గతంలో మునిసిపల్ ఛైర్మన్‌గా, ఎమ్మెల్యేగా నగటు జనంతో మమేకం చెందడం ఒక్కటే కారణం అనుకోవచ్చు. పేద ప్రజలు నివసించే ప్రాంతాలలో రమేష్‌రెడ్డి పట్ల ఎంతో ఆప్యాయత కన్పిస్తుంది. మొన్నటి శాసనసభ ఎన్నికలలో టిక్కెట్ రాకపోవడం పట్లనే వారిలో సానుభూతి ఏర్పడి వుండింది; దాన్ని ఇప్పటి ఎన్నికలలో సామూహికంగా ప్రదర్శించారు.

అనూరాధకు టిక్కెట్ వచ్చిందన్న వార్త నెల్లూరుకు చేరగానే ఈ సానుభూతి పవనాలు ఎల్లెడలా వెల్లువికినాయి. ఆ రోజే గెలుపు ఆమెదేనన్నే భావం ఏర్పడింది. కాని ప్రచారం చివరి దశలో ఆమె నడక మందగించడం, పార్టీలో అంతర్గతంగా ఓటి పలుకు విన్పడడంతో ఆమె గట్టెక్కదేమోనన్న అభిప్రాయం వ్యాపించింది. అయితే ప్రచారం ఎట్లా జరిగినా, పార్టీ నేతలు ఎట్లా జరగాలని అభిలషించినా ఓటర్లలో ఏర్పడిన అభిప్రాయంలో మార్పు వుండదని నిరూపించాయి ఈ ఎన్నికలు.

### ప్రభదేదీప్యమానం!

ఎట్లయితేనేమి, రమేష్‌రెడ్డికి రాజకీయ పునర్జన్మ లభించింది. ఎమ్మెల్యే టిక్కెట్ నిరాకరణతో ఆయన పని గోవిందా అనుకున్నవారంతా ఇప్పుడు ఉలిక్కిపడక తప్పని స్థితి. అధికారికంగా ఛైర్మన్ అనూరాధ అయినా అధికారం మాత్రం రమేష్‌రెడ్డి చేతుల్లోనే వుంటుందనడం నిజం. ఆ పదవిలోని మాధుర్యం ఒకసారి రుచి చూసినవాడు కాబట్టి పెత్తనం చెలాయింపు మొదటరోజే మొదలై పోతుంది. జిల్లా తెలుగుదేశం రాజకీయాలలోనూ ఆయన్ను ప్రక్కన పెట్టడం కుదరదు. ఈ విజయం మాజీ మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డికి మాత్రం బాధాకరం. నెల్లూరు టౌన్‌పై పెత్తనం కోసం పరితపించారాయన. ఇప్పుడిక సూదిమొన మోపే సందు కూడా ఇవ్వడు రమేష్!

### వళ్లు విరుచుకున్నది వైటి మాత్రమే!

ఈ ఎన్నికల్లో మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి తర్వాత తెలుగుదేశం గెలుపు కోసం చిత్త శుద్ధితో పనిచేసింది వైటి. నాయుడు మాత్రమే! పార్టీలో కొత్త కోడలుతో సమానం కాబట్టి శీల పరీక్షలో శంకలు తలెత్తకుండా జాగ్రత్త పడ్డాడు. తన కిచ్చిన మూడు వార్డులతో సరిపెట్టుకోకుండా టౌనంతా కలియదిరిగాడు. తెలుగుదేశం టౌన్ నేతలలో అంతగా వళ్లు విరుచుకొని

## వై.టి. ఒక్కడే నిజాయితీగా పనిచేశాడు

పనిచేసిన వారు మరెవ్వరూ లేరు. శ్రీధరకృష్ణారెడ్డి - పిలవని పేరంటానికి పోవడం ఎందుకని తన వార్డుకు పరిమితమైపోతే - వైవి. రామిరెడ్డి వంటి వారు ఓపన్‌గానే తమ విధ్వంసక శక్తి ప్రదర్శించారు.

### యశోధరకు బ్యాడ్ లక్!

కాంగ్రెస్ అభ్యర్థిని డాక్టర్ పి. యశోధర నిజంగా దురదృష్టవంతురాలు. పదవి ఫలం చేతికంది నోటికి చేరేలోగా జారిపోయింది. రాజకీయాలలోకి రావడం ఆమెకు ఎంత మాత్రం ఇష్టం లేదు. ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి బలవంతంగా ఒప్పించారామెను. ఆమె అభ్యర్థిత్వం పట్ల టౌన్‌లో సర్వత్రా సానుకూలత వ్యక్తమైంది. విద్యావంతులు, మధ్యతరగతి కుటుంబీకులు ఎంతగానో హర్షించారు. పైపెచ్చు తనకు రాజకీయం కొత్త అయినా - ఆ లోపం ఎంత మాత్రం కన్పించకుండా అద్భుతమైన వాగ్ధాటి, కలగోలుపు తనం ప్రదర్శించారామె. కేవలం పది రోజులలో మునిసిపల్ పరిపాలన పట్ల, సమస్యల పట్ల స్పష్టమైన అవగాహన సంతరించుకొని, స్పష్టంగా అభిప్రాయాలు వ్యక్తం చేశారు. ఆమె ఎక్కడ ఏ సభలో మాట్లాడినా జనం హర్షించారు. ఇన్ని అర్హతలు, అనుకూలతలు వుండికూడా విజయం ఆమె దరికి చేరలేదు. అందుకే దురదృష్టవంతురాలు - అన్నది.

ఈ ఓటమి పరాభవాన్ని ఆమె ఎట్లా స్వీకరిస్తున్నారో తెలియదు. క్రీడా స్ఫూర్తితో తేలికగా భావించి, ప్రజా జీవితంలో అదే ఉత్సాహంతో పాలు పంచుకొంటే మాత్రం మంచి మహిళా నేత కాంగ్రెస్ పార్టీకి లభించినట్లవుతుంది. యశోధర వంటి అభ్యుదయ భావాలు కల్గిన ఉన్నత సంస్కార మూర్తులు ప్రజాజీవితం పట్ల మమకారం చూపితేనే - రాజకీయాలలో మహిళల ప్రాధాన్యత పెరగాలన్న ఉద్యమానికి సఫలత్వం సిద్ధిస్తుంది!

### వివేకాకు ఎదురుదెబ్బ

ఈ ఎన్నికలలో అందరికంటే - చివరకు అభ్యర్థిని కంటే కూడా - విషాదంతో నీరసపడిపోయిన కాంగ్రెస్‌వాది - ఆనం వివేకానందరెడ్డి. తెలుగుదేశంలో రమేష్‌రెడ్డికిది వ్యక్తిగత విజయమైతే - వివేకానందరెడ్డికి వ్యక్తిగత పరాజయం. ఎమ్మెల్యే ఎన్నికల్లో గెల్చిన ఉత్సాహంతో మొత్తం మునిసిపల్ ఎన్నికల బరువును తనంతట తానుగా భుజాలకెత్తుకున్నాడాయన. మరే ఇతర కాంగ్రెస్ నేతకూ పాత్ర ప్రమేయం ఇవ్వలేదు. అభ్యర్థిత్వ ఎంపిక, కౌన్సిలర్ల టిక్కెట్ల పంపకం, ప్రచారం, వనరులు సమకూర్చడం వంటివన్నీ

కొరవ 7వ పేజీలో

# వెన్నుపోట్ల మధ్య బయటపడ్డ 'యానాది

కావలి మునిసిపల్ ఛైర్మన్‌గా గ్రంధి యానాదిశెట్టి గురువైన కలికి యానాదిరెడ్డి వెన్నుపోటును ధీటుగా ఎదుర్కొని 1963 ఓట్ల మెజార్టీతో విజయం సాధించారు. పోటీలో వున్న యిద్దరు అభ్యర్థులకు భారీగా వెన్నుపోట్లు వున్నప్పటికీ, వాటిని తట్టుకొని యానాదిశెట్టి అతి కష్టం మీద బయటపడగల్గాడు.

రాంకోటారెడ్డికి భారీ మెజారిటీ రావచ్చు అనుకున్న వార్డుల్లో ఆయన చతికిలబడగా, యానాదిశెట్టికి మెజార్టీ రావాల్సిన వార్డుల్లో ఆయన బోర్లాపడ్డాడు. చివరి నాలుగు రోజుల్లో ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి, రామకోటారెడ్డి ఓటమికి శక్తివంచన లేకుండా ప్రయత్నించి విజయం సాధించాడు.

1వార్డు నుండి 7వార్డు వరకు రాంకోటారెడ్డికి వేయి ఓట్ల మెజారిటీ వస్తుందనుకొని అంచనా వేయగా ఇక్కడ ఆయనకు కేవలం 483 ఓట్ల మెజార్టీ రావడంతో, యానాదిశెట్టి గెలుపు ఖాయమైపోయింది. మొదటి రౌండ్‌లోనే 'దేశం' ఖంగుతినడం ఆశ్చర్యం కల్గించగా, 2వ రౌండ్, 3వ రౌండ్‌లో సమానంగా ఓట్లు వస్తాయనుకున్నా స్వల్పంగా తెలుగుదేశంకు, యానాదిశెట్టికి 3వ రౌండ్‌లో 1183 ఓట్ల మెజార్టీ లభించింది.

4వ రౌండ్‌లో 22వార్డు నుండి 28వ

## వేటిరెడ్డికి వంటేరు దెబ్బ!

వార్డు వరకు యానాదిశెట్టికి భారీ మెజారిటీ వస్తుందని భావించగా, ఇక్కడ రాంకోటారెడ్డి కంటె కేవలం 706 ఓట్లు ఎక్కువగా వచ్చాయి. దేశం అభ్యర్థికి మొదటి రెండు రౌండ్లలో అతి తక్కువ మెజార్టీ లభించడం, యానాదిశెట్టికి మూడవ రౌండ్‌లో వెయ్యి ఓట్ల ఆధిక్యం లభించడంతో ఆయన విజయం ఖాయమైంది.

కులం ఓట్లు భారీగా పోలు కావడం కూడా గ్రంధికి కలసి వచ్చింది. పట్టణంలో అత్యధికంగా ఉన్న వైశ్య కులస్థులకు 11వేల ఓట్లు ఉండగా, మెజార్టీ శాతం యానాదిశెట్టికే వేశారు. కాంగ్రెస్‌కు మెజార్టీ రావాల్సిన చాలా వార్డుల్లో కాంగ్రెస్ తరపున కౌన్సిలర్లుగా పోటీ చేసిన అభ్యర్థులకు మెజార్టీ రాగా, యానాదిశెట్టికి తక్కువ ఓట్లు వచ్చాయి.

ప్రతివార్డులోనూ వెన్నుపోట్లు కారణంగా, క్రాస్ ఓట్ల కారణంగా చాలా వార్డులలో ఫలితాలు అనూహ్యంగా వుండగా, ఛైర్మన్ అభ్యర్థుల విషయంలోనూ యిలాగే వెన్నుపోట్ల కారణంగా, అభ్యర్థుల విజయం తారుమారయ్యింది.

1వార్డులో కాంగ్రెస్ రెబల్ అభ్యర్థి తోట రమాదేవికి 539 ఓట్లు రాగా, ఇక్కడ ముందు అనుకున్నట్లుగానే భారీగా కాంగ్రెస్ ఓట్లు చీలి 'దేశం' అభ్యర్థిని రమణమ్మ విజయం సాధించింది. 2వార్డులో ఎటువంటి పోటీ లేకపోగా దేశం అభ్యర్థి చక్కా

కొరవ 7వ పేజీలో

# నే'తల'రాతలు మార్చిన వార్డు ఎన్నికల ఫలితాలు!

నెల్లూరు మునిసిపాలిటీలోని 44 వార్డుల్లో 10వ వార్డు నుంచి తెలుగు దేశం అభ్యర్థిగా పోటీ చేసిన ముంగమూరు శ్రీధర కృష్ణారెడ్డి కౌన్సిలర్లందరిలోనూ అత్యధిక మెజార్టీ 1,540 ఓట్లు తెచ్చుకొన్నారు. ఈ వార్డులో కాంగ్రెస్ అభ్యర్థి పోటీ చేయలేదు. అతి తక్కువ మెజార్టీ 23 ఓట్లను 43వ వార్డు నుంచి కౌన్సిలర్‌గా గెల్చిన కాంగ్రెస్ అభ్యర్థి తాటుకూరు నాగేశ్వరరావు తెచ్చుకొన్నారు. టౌన్‌లోని అన్ని వార్డుల్లో పోటీ చేసిన అభ్యర్థులు, వారు తెచ్చుకొన్న ఓట్లు దిగువ నిస్తున్నాం.

### 1వ వార్డు

మొత్తం ఓట్లు : 7,250
పోలైనవి : 3,421
చెల్లనివి : 116

**పదాల జయకుమారి (దేశం) 1253**

భారతమ్మ (కాంగ్రెస్) 986; అన్నపూర్ణమ్మ (సిపిఎం) 1036; కంచర్ల చిన్నమ్మ (ఇండి) 8; మేరీ వర్గీనియం (ఇండి) 135; పోలూరి వెంకమ్మ (ఇండి) 3; మెజార్టీ 217

### 2వ వార్డు

మొత్తం ఓట్లు : 8,070
పోలైనవి : 3,950
చెల్లనివి : 267

**పొట్టెల చంద్రశేఖర్ (ఇండి) 1,359**

పఠాన్ మహబూబ్ బాషా (కాంగ్రెస్) 669; మున్నా సురేంద్ర (దేశం) 792; షేక్ ఖాజా రహంతుల్లా (సిపిఎం) 1082; సిహెచ్ శ్రీనివాసులు (ఇండి) 2; దర్శి ప్రసాద్ (ఇండి) 14; రేవాటి గోవర్ధన రెడ్డి (ఇండి) 4; షేక్ జిలాని (ఇండి) 21; సయ్యద్ బషీర్ (ఇండి) 7 మెజార్టీ : 277

### 3వ వార్డు

మొత్తం ఓట్లు : 8,130
పోలైనవి : 4,262
చెల్లనివి : 136

**సారా ప్రసాదిని (బిజెపి) 2,448**

బండి కస్తూరిదేవి (కాంగ్రెస్) 1,678 మెజార్టీ : 770

### 4వ వార్డు

మొత్తం ఓట్లు : 4,840
పోలైనవి : 2,570
చెల్లనివి : 47

**కాకర్ల గురవయ్య (దేశం) 1,428**

పసుపులేటి ప్రసాద్ (కాంగ్రెస్) 828; రామరాజు వివేకం (సిపిఐ) 237; చేతిరెడ్డి సతీష్ (ఇండి) 5; బొర్డువల్లి చంద్రమౌళి (ఇండి) 20. మెజార్టీ : 600

### 5వ వార్డు

మొత్తం ఓట్లు : 4,880
పోలైనవి : 2,943
చెల్లనివి : 88

**కన్నెర ప్రసాద్ (దేశం) 1,199**

గ్రంథి నారాయణ శెట్టి (కాంగ్రెస్) 574; పెళ్లూరు శ్రీనివాసులు (ఇండి) 1,071; ఉయ్యాల వెంకటేశ్వర్లు (ఇండి) 2; శ్రీహరి ముట్లూరు (ఇండి) 9. మెజార్టీ : 128

### 6వ వార్డు

మొత్తం ఓట్లు : 5,070
పోలైనవి : 2,710
చెల్లనివి : 42

**M. పెద్ద సుబ్బారాయుడు (దేశం) 1,534**

సూరేపల్లి కిషోర్‌బాబు (కాంగ్రెస్) 1,056; యనమల చంద్రమోహన్ (ఇండి) 6; రేనంగి రామ్‌ప్రసాద్ (ఇండి) 72; యనమల చంద్రమోహన్ 6. మెజార్టీ : 478

### 7వ వార్డు

మొత్తం ఓట్లు : 3,500
పోలైనవి : 2,077
చెల్లనివి : 60

**M. విజయలక్ష్మి (బిజెపి) 1,120**

చిన్ని పద్మ (కాంగ్రెస్) 547; కాపు సుశీలమ్మ (ఇండి) 0; గంగిశెట్టి మాధవి (ఇండి) 17; చింతమశెట్టి శకుంతలమ్మ (ఇండి) 6; మహమ్మద్ సంషాద్ బేగం (ఇండి) 157; సానిశెట్టి రాజ్యలక్ష్మి (ఇండి) 9; యం. సీతాలక్ష్మి (ఇండి) 161. మెజార్టీ : 573

### 8వ వార్డు

మొత్తం ఓట్లు : 5,260
పోలైనవి : 2,457
చెల్లనివి : 41

**చీరుపోగు బుజ్జయ్య (దేశం) 1,435**

కునిపోగు చిన్నయ్య (కాంగ్రెస్) 970; ఇసుకల శ్రీనివాసులు (ఇండి) 11. మెజార్టీ: 465

### 9వ వార్డు

మొత్తం ఓట్లు : 9420
పోలైనవి : 4949
చెల్లనివి : 132

**పిట్ల చెంచులక్ష్మి (సిపిఎం) 1,689**

యేకొల్లు నాగేశ్వరి (దేశం) 1,545; పోలూరు విజయలక్ష్మి (కాంగ్రెస్) 1,545; కత్తి క్రిష్ణమ్మ (ఇండి) 7; కామంచి శేషమ్మ (ఇండి)20; చలంచర్ల లక్ష్మి (ఇండి) 11. మెజార్టీ : 144

**మెజారిటీల్లో శ్రీధరకృష్ణారెడ్డి కొత్త రికార్డు**

### 10వ వార్డు

మొత్తం ఓట్లు : 5,640
పోలైనవి : 2,895
చెల్లనివి : 56

**M. శ్రీధర్‌కృష్ణారెడ్డి (దేశం) 2,159**

రామా ఆంజనేయులు (సిపిఐ) 619; దార్ల బాబు (ఇండి) 15; షేక్ మొహిద్దీన్ (ఇండి) 30; వారణాసి వెంకట మధుకుమార్ (ఇండి) 16 మెజార్టీ : 1,540

### 11వ వార్డు

మొత్తం ఓట్లు : 5,530
పోలైనవి : 3,272
చెల్లనివి : 69

**B. ఆరోగ్యస్వామి (కాంగ్రెస్) 1,350**

కన్నెర మాలకొండయ్య (ఇండి) 14; వార్ల సుబ్రహ్మణ్యం (దేశం) 1,006; పెయ్యల రత్తయ్య (ఇండి) 87; భీముని సాంబశివ రావు (ఇండి) 9; బూదూరు అబ్రహం (ఇండి) 31; యర్రంశెట్టి దొరస్వామి (ఇండి) 706. మెజార్టీ : 344

### 12వ వార్డు

మొత్తం ఓట్లు : 8,550
పోలైనవి : 4,144
చెల్లనివి : 94

**K. శ్రీనివాసులు రెడ్డి (దేశం) 2,039**

ఆనం జయకుమార్ రెడ్డి (కాంగ్రెస్) 1,235; యలమందల నాగేశ్వర రావు (సిపిఎం) 776. మెజార్టీ : 804

### 13వ వార్డు

మొత్తం ఓట్లు : 6,530
పోలైనవి : 2,783
చెల్లనివి : 69

**షేక్ బాషా (దేశం) 1,423**

కునిశెట్టి శ్రీధర్ (కాంగ్రెస్) 540; కన్నెర మాలకొండయ్య (ఇండి) 19; కోటి వెంకటేశ్వర్లు (ఇండి) 7; నెల్లూరు ప్రభాకరయ్య (సిపిఎం) 649; పాటూరు సురేఖ (ఇండి) 148. మెజార్టీ : 774

### 14వ వార్డు

మొత్తం ఓట్లు : 3,430
పోలైనవి : 1,613
చెల్లనివి : 34

**కన్నెర క్రిష్ణమూర్తి (బిజెపి) 661**

పసుపులేటి వెంకటేశ్వర్లు (కాంగ్రెస్) 282; సిరిగిరి చక్రవర్తి (ఇండి) 633; కండికట్ల సుమంత్ కుమార్ (ఇండి) 3. మెజార్టీ 28

### 15వ వార్డు

మొత్తం ఓట్లు : 6,620
పోలైనవి : 3,214
చెల్లనివి : 132

**వున్నం బసవయ్య (సిపిఎం) 1,302**

చేర్ల శేషయ్య (కాంగ్రెస్) 953; నాగిరెడ్డి శ్రీనివాసులు రెడ్డి (దేశం) 806; బి. చంద్ర శేఖర రెడ్డి (ఇండి) 8; దొనాదుల శేషయ్య (ఇండి) 7; ముంగర విజయకుమార్ (ఇండి) 6. మెజార్టీ : 349

### 16వ వార్డు

మొత్తం ఓట్లు : 5,220
పోలైనవి : 2,872
చెల్లనివి : 70

**వూటుకూరు లక్ష్మయ్య (కాంగ్రెస్) 1,352**

డి.పి. రెడ్డి (బిజెపి) 425; పి. వెంకటేశ్వరరెడ్డి (ఇండి) 1,002; కలవకూరు శ్రీనివాసులు రెడ్డి (ఇండి) 17; అంచల వెంకటేశ్వర రావు (ఇండి) 2; అనుమల రవిశంకర్ (ఇండి) 4. మెజార్టీ : 350

### 17వ వార్డు

మొత్తం ఓట్లు : 6,420
పోలైనవి : 3,288
చెల్లనివి : 120

**పిండి సురేష్‌బాబు (ఇండి) 1,074**

కలవకూరు విజయశేఖర్ రెడ్డి (కాంగ్రెస్) 996; కొండేటి రఘురామి రెడ్డి (దేశం) 977; కె. అంబాలగన్ (ఇండి) 31; కసుమర్తి జనార్ధన నాయుడు (ఇండి) 6; నీర్ల వెంకయ్య (ఇండి) 105; యం. విక్టర్ ఇమానుయేల్ (ఇండి) 9. మెజార్టీ : 70

### 18వ వార్డు

మొత్తం ఓట్లు : 6,350
పోలైనవి : 2,749
చెల్లనివి : 59

**N. భానుశ్రీ (కాంగ్రెస్) 1,430**

పసుపులేటి ఇంద్రావతమ్మ (దేశం) 1,029; గంగాళ్ల నందన (ఇండి) 1; బెల్లంకొండ వరలక్ష్మి (ఇండి) 8; షేక్ ఆసియా (ఇండి) 198; షేక్ మల్లిక (ఇండి) 9; షేక్ హసీనా (ఇండి) 15. మెజార్టీ : 401

### 19వ వార్డు

మొత్తం ఓట్లు : 6,600
పోలైనవి : 3,528
చెల్లనివి : 133

**G. మాథ్యూస్ ఎలీషా (కాంగ్రెస్) 1,024**

వులవపాటి రమణయ్య (ఇండి) 579; బత్తుల మల్లికార్జున (బిజెపి) 521; కాకి పెంచలయ్య (ఇండి) 6; గంటా మాతయ్య (ఇండి) 2; గంటా రవీంద్ర బాబు (ఇండి)

తొరవ 11వ పేజీలో

# ఇదా విప్లవం?

రాష్ట్ర పంచాయతీరాజ్ శాఖ మంత్రి ఎలిమినేటి మాధవరెడ్డిని పీపుల్స్‌వార్ నక్సలైట్లు పరమ కిరాతకంగా చంపారు. హైదరాబాద్‌కు సమీపంలోని ఘట కేశ్వర్ వద్ద రైల్వే ఓవర్ బ్రిడ్జిపై మందుపాతర పేల్చి మాధవరెడ్డి ప్రయాణిస్తుండిన కారును తునాతునకలు చేశారు. మునిసిపల్ ఎన్నికల ప్రచారం ముగించుకొని నగరానికి తిరిగి వచ్చే సమయంలో, చీకటి మాటున, కాలనాగుల వలె పొంచివుండి మరీ కాటేశారు. నక్సలైట్లు రాజకీయ వాదులను బలి చేయడం పదిహేనేళ్ల క్రితం మల్‌హర్‌రావు హత్యతోనే ప్రారంభమైంది. కాని వారు ఒక రాష్ట్ర మంత్రిని కసాయితనంగా చంపడం ఇదే ప్రథమం.

తెలుగుదేశం పార్టీలో మాధవరెడ్డి అత్యంత చురుకైన నాయకుడు. జనరంజకత్వం కల్గిన ప్రజాప్రతినిధి. నల్గొండ జిల్లాలో ఆయనకు అపారమైన ప్రజాభిమానం వుంది. పోటీ చేసిన ప్రతి ఎన్నికలోనూ ఆయన గెలిపించారు ఓటర్లు. స్ఫురద్రూపం, వాగ్ధాటి, సరస సంభాషణా చతురత, ఏ విషయంపైనైనా లోతుగా అధ్యయనం చేసి, అవగాహన పెంచుకోగల్గిన నేర్పు వుండడం వల్ల రాష్ట్ర మంత్రి వర్గంలో అత్యంత సమర్థుడిగా పేరు తెచ్చుకున్నారు. ఆయన చేసిన పాపం కూడా అదే! గత నాలుగేళ్లగా హోం మంత్రిగా మాధవరెడ్డి రాష్ట్రంలో నక్సలైట్ల అణచివేతకు ఎన్నో చర్యలు చేపట్టారు. అది వారికి కంటగింపు అయ్యింది. ఆయన్ను తమ శత్రువుగా భావించి హతమార్చేశారు.

నక్సల్ బరి ఉద్యమ లక్ష్యం - విప్లవం! తమ లక్ష్యసాధనకు తుపాకీ చేతపట్టడంలో, వర్గ శత్రువులను నిర్మూలించడంలో వారు పశ్చాతాప పడవలసినదేమీ లేదన్నది వారి సిద్ధాంతం. కాని 'వర్గ శత్రువు' అనే పదానికి వారి సిద్ధాంత పుస్తకాలలో స్పష్టమైన నిర్వచనం వుంది. ప్రజలను పీడించేవారు, దోచుకునేవారు మాత్రమే వర్గ శత్రువులవుతారు. లేదా తమ విప్లవ పంథాకు అడ్డుతగిలే వారినీ హిట్‌లిస్టులో చేర్చవచ్చు. ఇందులో మాధవరెడ్డి ఏ కోవకు చెందుతారో నక్సలైట్లే చెప్పాలి. విప్లవకారులను హతమార్చడానికి పోలీసు యంత్రాంగాన్ని ఉసి గొల్పాడన్నది ఆయన చేసిన నేరం అయితే - అది తన వ్యక్తిగత స్వార్థంతో చేసిన పనికాదు. ప్రభుత్వ భాగస్వామిగా నెరవేర్చిన కర్తవ్యం మాత్రమే. ఆయన హోం మంత్రిగా వుంటూ, విప్లవ విఘాతం కల్పించే సమయంలో ఆయన్ను చంపివుంటే - కొంతలో కొంత నక్సలైట్లను అర్థం చేసుకోవచ్చు. కాని మాధవరెడ్డి ఇప్పుడు హోం మంత్రికాదు; పోలీసుల చర్యలతో ఆయనకు సంబంధం లేదు. ఎప్పుడో చేసిన పనులకు ఇప్పుడు శిక్ష విధించడం - రౌడీలు, గూండాల వలె పాత కక్ష తీర్చుకోవడం అవుతుంది తప్ప, విప్లవ లక్ష్యం నెరవేర్చటం ఎంత మాత్రం కాదు.

విప్లవకారులు ఒక నరబలి చేసినప్పుడు - దాని వల్ల విప్లవానికి లేదా ప్రజలకు ఏదో ఒక రూపంలో ప్రయోజనం కలగాలి. మాధవరెడ్డి హత్య వల్ల ఆయన కుటుంబం విషాద వేదనతో కుమిలిపోవడం తప్ప ఎవరికి ఏ మేలు జరిగింది? ప్రభుత్వంపై తిరుగుబాటులో ఒక భాగం అనుకోవడానికి లేదు. ప్రభుత్వాన్ని కూలదోయాలంటే ప్రజల సహకారం, పాత్ర వుండాలి. రష్యాలో, చైనాలో ఆనాడు విప్లవం వికసించిందంటే - అందులో సామాన్య ప్రజలు అసంఖ్యాకంగా పాలు పంచుకున్నారు. మావో లాంగ్ మార్చ్‌లో లక్షలాది జనం ఉప్పెన వలె విరుచుకపడ్డారు. పీడించే ఫ్యూడల్ ప్రభుత్వాన్ని కూలద్రోశారు. కాని ఇప్పటి నక్సలైట్ల ఉద్యమంలో ప్రజల పాత్రలేదు; రాష్ట్రంలో ఫ్యూడల్ ప్రభుత్వమూ లేదు. తమ ఉద్యమానికి ప్రజల సానుభూతి, సహకారం, పాత్ర పొందడంలో విఫలమౌతున్న నక్సలైట్లు ప్రజలను భయోత్పాతంలో ముంచడం ద్వారా ఉద్యమానికి ఆటంకం లేకుండా చేసుకోవాలని భావిస్తున్నట్లు వుంది. ఇది విప్లవానికి ఏ మాత్రం సహకరించదు సరికదా - విప్లవం పట్ల ప్రజలలో వైముఖ్యం కల్గడానికి తోడ్పడుతుంది. తమ ఉన్మాద హింసా చర్యల వల్ల తమ చేతులతోనే తమ ఉద్యమాన్ని ప్రజలకు దూరం చేసేస్తున్నారు నక్సలైట్లు. వారిని నడిపించే నేతలు, సిద్ధాంత కర్తలు ఆత్మ విమర్శ చేసుకోవాల్సిన సమయం ఇది. ఒక విప్లవ కారుడు అంతరిస్తే వెయ్యి మంది కొత్తగా అంకురిస్తారన్నది వారి నమ్మకం. అది జరుగుతుందో, లేదో కాని ఒక మంత్రిని హతమారిస్తే, మరు క్షణంలో మరొక మంత్రి తెరపై రావడం మాత్రం ఖాయం. ప్రభుత్వం పట్ల ప్రజలలో విశ్వాసం అంతరింపజేసి, నూతన ప్రభుత్వ స్థాపనకు ప్రయత్నించడం విప్లవ కార్యక్రమం అవుతుంది తప్ప - ప్రభుత్వంలోని భాగస్వాములను అప్పుడప్పుడు సంహరిస్తే - ప్రభుత్వాలు మారుతాయా? రాజుల పాలనలో అయితే ఒక రాజు సింహాసనం దిగితే ఆ పాలన అంతరించిపోయినట్లు లెక్క. కాని ప్రజాస్వామ్యంలో ప్రభుత్వాన్ని నడిపేది వ్యక్తులు కాదు; వ్యవస్థ! వ్యక్తి హింస ద్వారా ప్రభుత్వాల మార్పిడి అసాధ్యం. ఈ నిజం తెలిసి ఇటువంటి హింసోన్మత్త చర్యలకు పాల్పడడం వారి అజ్ఞానం.

జమీన్‌రైతు

మాధవరెడ్డి హత్యతో రాష్ట్ర ప్రభుత్వానికి ఒక పెద్ద సవాల్ ఎదురైంది. మంత్రుల ప్రాణాలకే భద్రతలేని వాతావరణం ఏర్పడితే ఇక ప్రజల మాటేమిటన్న ప్రశ్నకు సమాధానం వెతుక్కోవలసి వస్తున్నది. ఇప్పటికే సగం రాష్ట్రం నక్సలైట్ల గుప్పెటలో వుంది. తెలంగాణా జిల్లాలలో, మరీ ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో ప్రభుత్వ ఉనికే లేదు. నక్సలైట్లకు చందాలు చెల్లించి, వారితో రాజీపడితే తప్ప బ్రతకలేకపోతున్నారు ప్రజలు. అధికారులు గ్రామాలకు వెళ్లడం మానుకున్నారు. మండల స్థాయిలో ప్రజాప్రతినిధులు ఇంటి పట్టునే వుండిపోతున్నారు. ఇటువంటి నేపథ్యంలో మంత్రి మాధవరెడ్డి హత్య జరిగింది. దీని ప్రభావం వల్ల క్రింది స్థాయిలో మరింత భయానక పరిస్థితులు ఏర్పడతాయి. రాష్ట్ర ప్రభుత్వం నక్సలైట్లను అదుపు చేయడానికి సత్వరం సమర్థవంతమైన చర్యలు చేపడితే తప్ప - ప్రజలలో అభద్రతాభావం తొలగిపోదు. అది తొలగనంత కాలం ప్రభుత్వ ఉనికికి అర్థం లేదు.

మాధవరెడ్డి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి వ్యక్తం చేస్తున్నాం.

* * *

## జమీన్‌రైతు 17.3.50

వెల: 0-2-0 పేజీలు: 12

### లాయకాలీ పరారీ

రజాకార్ ప్రధానమంత్రి మాయమయ్యే సరికి లోకమంతా కోడైకూసింది; "ఇదేమీ చిత్రం? ఏమిటి మాజిక్!

పోలీసు చర్య అనంతరం హైదరాబాద్‌లో కొనసాగిన పరిపాలనా విధానమును నిశితంగా పరిశీలించినవారికి మీర్ లాయక్ అలీ అంతర్ధానం ఎంత మాత్రం ఆశ్చర్యం కల్గించదు.

ఈ సంస్థానం అన్ని విధాలా అధోగతిపాలైనది. రజాకార్ల హయాంలో రాక్షసకృత్యాలు, అంతకు మునుపు కని విని ఎరుగని గులామీ. పోలీసు చర్య అనంతరం హాయిగా వుందాం అనే జనానికి గ్రామాలలో కమ్యూనిస్టు చర్యలు క్షోభను కలిగించినవి. వారిని వెంటాడి మిలిటరీ వారూ కొంత భయోత్పాతం కలిగించడానికి కారణమైనారు. ఇక ఉద్యోగ బృందం పల్లెలలో, పట్నవాసాలలో లంచగొండితనంతో అవినీతితో ప్రజలను అనేక విధాల హింసించారు. అదే సమయంలో, ప్రజావాణిగా ధీరోచితంగా అంత వరకు ఉద్యమాన్ని నడిపించిన స్టేట్ కాంగ్రెస్ చీలికలై పేలికలై పోయింది. ప్రజలకు దారి. తెన్నూ చూపే శక్తిలేక పోయింది. ఉద్యోగి బృందానికి అదుపాజ్ఞలను శాసించే శక్తి లేకపోయింది. ఈ సమయంలోనే కాంగ్రెస్ హైకమాండ్ పక్షపాత దృష్టికారణంగా స్టేట్ కాంగ్రెస్ గొడవలు మరింత క్షీణించి, స్వామీజీ సన్యాసం వరకూ పరిస్థితి వచ్చింది.

### వెంకటగిరి క్షామం

ఈ సంవత్సరం కూడా వెంకటగిరి తాలూకాలో చాలా గ్రామాదులు వర్షాభావం వలన, నవంబరు నెలలో కురిసిన స్వల్పపాటి వర్షమునకు తెగిపోయిన చెరువు కాల్వలకు రిపేర్లు లేనందున ఎండిపోయినవి. సదరు

50 ఏళ్ల క్రితం ఈ వారం

తాలూకాలో తూర్పుభాగం కొన్ని గ్రామాదులు అనగా భీమవరం, మేనకూరు, చిగురుపాడు, తిమ్మాజీకండ్రిగ, గ్రద్దగుంట, పున్నేపల్లి, నెమళ్లపూడి, కరబల్లవోలు, భట్లగమపూరు, అత్తివరం వగైరా గ్రామాదులలో మాత్రం కపిలతోలకం వల్లనున్నూ, నీళ్లమిషనుల వల్లనున్నూ, సగానికి సగం చాలా తప్పరగా పండినది. వెంకటగిరి చుట్టుప్రక్కలయేమో ఒకానొక గ్రామం మాత్రం షుమారుగా పండినది. మిగతా గ్రామాదులలో పూర్తిగా పైరుపోయి యిప్పటికే కూలి జనులు, మధ్యరకం

తరువాయి 10వ పేజీలో

## జనవాణి

# ఎందుకీ దండగమారిన వ్యవసాయ శాఖ?

వ్యవసాయ రంగం రాను రాను రైతుకు ఉపయోగ పడని రంగంగా మారిపోయింది. సకాలంలో వర్షాలు పడక పోవడం, పంట చేతికి వచ్చే సమయంలో అకాల వర్షాల కారణంగా చేతికి వచ్చిన పంట నీటిపాలయ్యింది. రైతుకు వ్యవసాయ శాఖ సకాలంలో సలహాలు అందజేయడం లేదు. వ్యవసాయంపై ఆధారపడిన దేశంలో జిల్లాలో ఒకరిద్దరే వ్యవసాయ శాఖ విస్తరణాధికారులే వుంటే, వ్యవసాయం ఏ విధంగా సజావుగా సాగుతుంది.

నార్త్ ఆములూరు వి. రామయ్య

### ప్రజాపంపిణీ వ్యవస్థను సరిదిద్దలేరా?

ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా సరఫరా చేసే బియ్యం, గోధుమలు, చక్కెరలపై కేంద్ర ప్రభుత్వం రేట్లు పెంచడం అన్యాయం, అక్రమం. కానీ కేంద్ర ఆర్థికమంత్రి మాత్రం గతంలో పదేసి కేజీల బియ్యం, గోధుమలు తక్కువ ధరకు కొనుగోలు చేసే కుటుంబాలు స్వల్పంగా అదనపు మొత్తం చెల్లించి ఇరవై కేజీల సరకు పొందవచ్చంటున్నారు. స్వల్పంగా ధర పెంచినా, కోటా రెట్టింపు చేసినందువల్ల పేదలు మార్కెట్లో హెచ్చు ధరకు ఆహారధాన్యాలు కొనుగోలు చేసే బాధ వుండదనేది మంత్రిగారి అభిప్రాయం. కాని దేశంలో ప్రజాపంపిణీ వ్యవస్థ ద్వారా పేదల కోసం పంపిణీకి నిర్దేశించిన ఆహార పదార్థాలు 50శాతం దొడ్డి దారిన ఓపెన్ మార్కెట్ చేరుతున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో ఈ వ్యవస్థలపై ఎటువంటి బిగింపులు చేయకుండా, కోటా రేట్లు పెంచడం కేంద్రంలోని బిజెపి ప్రభుత్వానికే చెల్లింది.

నెల్లూరు పి. కాత్యాయని

### క్లింటన్ ఉబలాటం

అమెరికా అధ్యక్షుడు బిల్ క్లింటన్ అంటే మన దేశ పాలకులకు భక్తి ప్రపత్తులు ఎక్కువయ్యాయి. క్లింటన్ ఇండియా - పాకిస్తాన్‌లకు సంబంధించిన వ్యవహారాల్లో తాను మధ్యవర్తిత్వం వహించబోవడం లేదని ఒకవైపు ప్రకటిస్తూనే మరో ప్రక్క తాను మధ్యవర్తిత్వం వహిస్తే తప్పు అక్కడ సమస్య పరిష్కారం కాదన్న రీతిలో దేశ దేశాలు తిరిగి ప్రచారం చేసుకొంటున్నారు. దీన్ని

తరువాయి 10వ పేజీలో

# ఖాళీ ఖజానాతో కొత్త ఛైర్మన్ కథాకళి!

నెల్లూరు మునిసిపాలిటీ ఖజానా ఖాళీ అయ్యింది. ఈ పరిస్థితుల్లో పదవిని చేపడు తున్న తాను అన్ని వ్యవహారాలు చక్క దిద్దేందుకు ప్రయత్నిస్తానని కొత్త మునిసిపల్

## సత్వర అవసరాలకు అత్యవసర ప్రాధాన్యం!

ఛైర్మన్ తాళ్లపాక అనూరాధ ఆత్మవిశ్వాసం వ్యక్తం చేశారు. మునిసిపల్ ఛైర్మన్‌గా ఎన్నికయ్యాక 15తేది తొలిసారిగా తన నివాసంలో విలేఖరులతో మాట్లాడారు. 125 సంవత్సరాల చరిత్ర కల్గిన మునిసిపాలిటీకి తొలి మహిళా ఛైర్మన్‌గా ఎన్నికయ్యే అవకాశం కల్పించిన ముఖ్యమంత్రికి కృతజ్ఞతలు తెలియజేశారు. తన విజయానికి శ్రమించిన టిడిపి, బిజెపి నాయకులు, కార్యకర్తలకు, ఓట్లేసిన ప్రజలకు ధన్యవాదాలు చెప్పారు. వేసవి కాలంలో పదవీ బాధ్యతలు స్వీకరిస్తున్నాను. నెల్లూరులో ఎండా కాలంలో ప్రజలు మంచినీటికై బాధపడ కుండా చేయాలన్నదే నా తపన. దీనికోసం ఒక కార్యక్రమాన్ని రూపొందిస్తాను. టౌన్‌లోని 40శాతం ప్రాంతాల్లో వీధిలైట్లు వెలగడం లేదు. బల్బులు కొనను మునిసిపాలిటీ వద్ద డబ్బులు లేవు. ఈ సమస్యను ఏదో విధంగా అధిగమించాలి. మునిసిపాలిటీ ఆర్థిక పరి పుష్టి కోసం అన్ని చర్యలు చేపడతాను. దీనికోసం మేధావులు, ప్రజలతో సమాలోచనలు ఏర్పాటు చేసి వారి

తొరవ 8వ పేజీలో

# అంతా 'పైవాడి' దయ

మునిసిపల్ ఎన్నికల్లో ఓటమి తర్వాత నెల్లూరు ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఆధ్యాత్మిక ధోరణిలో మాట్లాడి అందరినీ ఆశ్చర్యపర్చారు. 12తేది కాంగ్రెస్ పార్టీ తరఫున గెల్చిన కౌన్సిలర్లందరినీ తన ఇంట్లో సమావేశ పర్చి విలేఖరులతో మాట్లాడారు. కాంగ్రెస్ పార్టీకి ఓటిచ్చిన ప్రజలందరికీ కృతజ్ఞతలు తెలియజేశారు. శ్రమించుబట్టే 17 కౌన్సిల్ స్థానాలు గెల్చుకోగలిగాం. ప్రతిపక్షం

## ఎన్నికల్లో ఓటమిపై వివేకా నిర్వేదం!

లో వుండి ప్రజలను కాపాడమని భగవంతుడు ఆజ్ఞాపించాడు. ప్రజలిచ్చిన తీర్పును శిరో ధార్యంగా భావించి, ప్రతిపక్షంలో వుంటూ ప్రజలను కాపాడుతామన్నారాయన. మా కుటుంబంలో ఎసి సుబ్బారెడ్డి మొదలు జయ కుమార్‌రెడ్డి వరకు ఏదో ఒక ఎన్నికల్లో ఓడిపో యినవాళ్లే. ఈ ఓటమి మాకు అలవాటే. ఓటమి నుంచి పాఠాలు నేర్చుకోను ఫీల్ కాము. ప్రతిపక్షంలోనే నేను ఎంతగానో రాణించాను. మునిసిపల్ ఛైర్మన్, ఛైర్మన్స్ ఛాంబర్ అధ్యక్షునిగా ఎంతో బాగా పనిచేసినట్లు చెప్పుకొన్నారు. కాంగ్రెస్ పార్టీ పక్షాన ఎన్నికైన కౌన్సిలర్లు ఎంతో అనుభవమున్నవారు. సందాని బాషా వరుసగా 4సార్లు, లక్ష్మయ్య, షఫీలు మూడుసార్లు, భానుశ్రీ రెండవసారి ఎన్నికైన అనుభవమున్నవారు. కొత్తవారికి వీరు మార్గదర్శకత్వం వహిస్తారు. మునిసిపల్ వైస్ ఛైర్మన్‌గా కాంగ్రెస్ పార్టీ తరఫున పోటీగా అభ్యర్థిని పెడతాం. కౌన్సిల్‌లో పార్టీ నాయకుడు, విప్‌లను కౌన్సిలర్లే ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నుకొంటారు. మునిసిపల్ ఛైర్మన్‌గా తన వైపుగా ఏదైన తప్పు జరిగివుంటే ప్రజలు క్షమించవమని వివేకానందరెడ్డి పత్రికా ముఖంగా కోరారు. కాంగ్రెస్ పార్టీ కౌన్సిలర్లు డాక్టర్ పిఎస్ఆర్కె మూర్తి, విలేకరి మాధవ్యాస్ ఎలీషా, ఇందిరాభవన్ సుధాకర్, మేస్త్రీ ఆరోగ్యస్వామి, మహిళా కౌన్సిలర్లు పులిమి శైలజ, సునందమ్మ, అనిత, సల్మాబషీర్, కాంతమ్మ గుణగణాలను ఎమ్మెల్యే ఈ సందర్భంగా వివరించారు. కొత్త కౌన్సిలర్లు కూడా ఈ సమావేశంలో మాట్లాడారు.





డి.కె.డబ్ల్యు కాలేజిలో జరిగిన నెల్లూరు మునిసిపల్ ఓట్ల లెక్కింపును పరిశీలిస్తున్న జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి, డిఆర్‌డిఏ పిడి. శ్రీధర్

# ప్రతిపక్షంలో ఉంటూ-పోరాటం చేస్తా!

తాను ఏదో విధంగా గెలుస్తానన్న అభిప్రాయంతో పలువురు చదువుకున్న వాళ్లు ఓటింగ్‌కు రాకపోవడంతో ఓటమి పాలుకావాల్సి వచ్చిందని నెల్లూరు మునిసిపల్ ఛైర్మన్ పదవి కోసం కాంగ్రెస్ పార్టీ అభ్యర్థినిగా పోటీ చేసి ఓడిన డాక్టర్ పల్లంరెడ్డి యశోధర వ్యాఖ్యానించారు. 14తేదీ బృందావనంలోని తన క్లినిక్‌లో విలేఖరులతో మాట్లాడారు. ఓటమికి తలదించుకోవాల్సిన అవసరం ఏదీ లేదన్నారు. ఒక రాజకీయ మార్పు కోసం నేను పోటీ చేశాను. అన్ని వర్గాల ప్రజలు ఓటు హక్కు వినియోగించు కొంటారని ఆశించాను. కాని కేవలం 50శాతం మంది ఓటర్లే పోలింగ్ కేంద్రాలకు తరలి వచ్చారు. చదువుకున్న వాళ్లు ఏదో విధంగా యశోధర గెలిచి పోతుందని భావించి తమ ఓట్లు వేయలేక పోయారు. దీనికితోడు గెలిచిపోతానన్న ఆత్మవిశ్వాసం, పలువురు ఓటర్లను స్వయంగా కలవలేక పోవడం, సమయాభావం ఇవన్నీ తన ఓటమికి కారణాలయ్యాయన్నారు. పార్టీలో వర్గాలున్న ఏ వర్గం తన ఓటమికిగాను, గెలుపుకుగాని ప్రత్యక్షంగా కృషి చేయలేదని డాక్టర్ వివరించారు. సిపిఎం పార్టీ కొనంతా సహకరించి వుంటే తన పరిస్థితి ఎంతో మెరుగ్గా వుండేదన్నారు. పార్టీలో ఇక నుండి ఇంకా చురుకైన కార్యకర్తగా పనిచేస్తానన్నారు. కౌన్సిలర్లందరినీ కలుపుకొని వెళ్లే ఐక్య కార్యాచరణ రూపొందిస్తానన్నారు. చేతిలో వున్న వైద్య వృత్తిద్వారా పేద ప్రజలకు అన్నివిధాలుగా అందుబాటులో వుండి ముందుకు సాగుతానన్నారు.

### కౌంటింగ్ ఉత్కంఠ భరితం

11తేదీ నెల్లూరు డికెడబ్ల్యు కాలేజీలో జరిగిన నెల్లూరు మునిసిపల్ ఎన్నికల కౌంటింగ్ ఆద్యంతం ఉత్కంఠ భరితంగా సాగింది. కౌంటింగ్ కేంద్రంలో ఏర్పాటు చేసిన 11రూముల్లో ఒక్కొక్క రౌండుకు 11వార్డుల ఓట్లను లెక్కబెట్టారు. ఈ విషయం ముందుగా ప్రకటించక పోవడంతో ఉదయం 7

## యశోధర

గంటలకు 44వార్డుల్లో పోటీ చేసిన అభ్యర్థులు, వారి ఏజంట్లతో కౌంటింగ్ కేంద్రానికి వచ్చేశారు. లోపలకు వెళ్లాక కౌంటింగ్ తీరును తెలుసుకొని పలువురు బయటకు వచ్చేశారు. కౌంటింగ్ కేంద్రంలోకి వెళ్లేవారిని పోలీసులు ఎంతో జాగ్రత్తగా పరీక్ష చేసిలోనికి పంపినా పలువురు సిగరెట్ ప్యాకెట్లు, అగ్గిపెట్టెలు, సెల్‌ఫోన్లతో తమ పనులు యథేచ్ఛగా చేసుకొని పోయారు. తొలిరౌండ్‌లో 11 వార్డుల్లో ఫలితం 11గంటలకే తెలిసి పోయింది. ఈ రౌండ్‌లో ఎక్కువ వార్డుల్లో తెలుగుదేశం పార్టీ గెలవడంతోపాటు, ఆ పార్టీ ఛైర్మన్ అభ్యర్థిని తాళ్లపాక అనూరాధకు 20,216 ఓట్లు వచ్చాయి. రెండవ రౌండ్ కౌంటింగ్ మొదలుకాగానే అత్యంత ప్రతిష్టకరంగా ఎన్నిక జరిగిన 12వార్డు ఓట్ల లెక్కింపు రూము వద్ద ఊపిరి పీల్చ వదలనంత

తొరవ 8వ పేజీలో

# రెండో పంట వేయవద్దండీ!

కరవు, అకాల వర్షంతో పంటలు నష్టపోయిన జిల్లా రైతులు రెండవ పంటపై ఆశలుపెట్టుకొని వున్నారు. కాని వారి ఆశలను జిల్లా అధికారులు నిరాశను చేస్తూ రెండవ పంటకు ఎటువంటి పరిస్థితుల్లో నీళ్లివ్వమని కలెక్టర్ శ్రీలక్ష్మి 12తేది జరిగిన జిల్లా సాగునీటి సలహా బోర్డు సమావేశంలో ప్రకటించారు. మునిసిపల్ ఎన్నికలు ముగిసిన మరుసటి రోజు ఈ సమావేశం పెట్టడంతో ఎమ్మెల్యేలు, రైతు ప్రతినిధులు గైర్హాజరు అవడంతో అధికారుల ప్రకటనకు అడ్డు చెప్పేవారే లేకుండా పోయారు. సమావేశంలో జిల్లా కలెక్టర్ మాట్లాడుతూ సోమశిలకు ప్రాజెక్ట్‌లో ప్రస్తుతం 12.80 టిఎంసిల నీరు నిల్వవుంది. ఇందులో డెడ్‌స్టోరేజ్ 7.57 టిఎంసిలు, రానున్న ఖరీఫ్ సీజన్‌లో నారుమళ్లకు 2.5టిఎంసిలు, నెల్లూరు, కావలిలతో పాటు ఇతర గ్రామాల్లో మంచి నీటి ఎద్దడి నెలకొనకుండా 3 టిఎంసిల నీరు వదలాలి. తరుగుదల 2 టిఎంసిలు పోను, ఖరీఫ్‌లో ప్రస్తుతం వున్న పంటలకు 1.50 టిఎంసిలు, రబీ క్రింద వేసిన ఏడి పంటలకు 1.50 టిఎంసిల నీళ్లు ఇవ్వాలని, ఈ మొత్తానికి 10.5

## నెల్లూరుసంగతులు

టిఎంసిలు వినియోగించాల్సి వస్తుందన్నారు. ప్రాజెక్ట్‌లో మిగిలివున్న 2.50టిఎంసిల నీరు రెండవ పంట వేసేందుకు ఏ విధంగా సరి పోదని జిల్లా కలెక్టర్ స్పష్టం చేస్తూ, రెండవ కారుకు ప్రయత్నించ వద్దని రైతులను కోరారు.

సమావేశానికి ముఖ్యఅతిథిగా విచ్చే సిన ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి

కొంవ 8వ పేజీలో

# శివసప్తాహ నిధి గుటకాయస్వాహా!

లక్షిపాలతో జిల్లాలోని చుట్టుపక్కల ప్రాంతాల నుంచి జనాకర్షణతో కొంత కాలం. వెలిగిపోయిన, దుర్వాస మహాముని ప్రతిష్ఠిం

## కోడూరు శివునికి కష్టాలు

చిన కోడూరు శివునకు కష్టాలు ప్రారంభమైనాయి. రెండు కార్లు పండే సలక్షణమైన మాగాణి భూమి 13ఎకరాలు వున్నా అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లుడి నోట్లో శని అన్నట్లు ధర్మకర్తలకు తప్ప దేవునికి ఉపయోగపడడంలేదు.

గతంలో కోడూరుకు చెందిన భక్తుడు విరాళాలు సేకరించి గ్రామస్తుల సహకారంతో గత సంవత్సరం వరకు 45 శివ సప్తాహాలు నిర్వహించారు. ఆయన చనిపోవడంతో ఆయన కుమారులు పక్కకు తప్పుకోవడంతో ఆ స్థానంలోకి కొత్తగా గ్రామకర్మకాండలు చూచే వ్యక్తి వచ్చి బాధ్యతలు చేపట్టి ప్రారంభంలోనే భక్తుల విమర్శలకు లోనయ్యాడు. 9రోజుల కార్యక్రమానికీను, ఉభయదాతలు,

తరువ 8వ పేజీలో



సింహపురి సంగీత సభ టౌన్‌హాలులో నిర్వహించిన డాక్టర్ వి.వి. సాయికృష్ణ యాచేంద్ర 200వ సంగీత గేయధార కార్యక్రమంలో ఆయనను సన్మానిస్తున్న గాయని సుశీల, ప్రక్కన జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి, రామకృష్ణ, మేడసాని మోహన్, ఆర్.వి. నాగరాజు, హనుమచ్ఛాస్త్రి, బివి నరసింహం.

# ఆత్మకూరు 'రీకో' ఇకఅంతేనా?

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రీకో) ఎండి చర్యలు, సంస్థను దివాళా తీయించేట్లుగా వున్నాయి. రీకో స్టోరులో 2లక్షల 80వేల రూపాయల విలువగల సామానులు పోతే ఈ రోజు వరకు ఆ ఉద్యోగిపై ఎండి ఎటువంటి చర్యలు తీసుకోలేదు. పైగా ఈ సామానులను రైతులకిచ్చినట్లు రికార్డుల్లో వ్రాయమని ఎ.ఇలను పురమాయించినట్లు తెలిసింది. ఎం.డి. రీకో డబ్బులతో రెండు ఎయిర్ కూలర్స్‌కొని ఒకటి ఆఫీసులోని తన రూములో, మరొకటి తన ఇంట్లో బిగించుకొన్నారు. ఆఫీసులో ఫోనుకు ఎస్‌టిడి సౌకర్యం, ఇంట్లో ఫోనుకు ఐఎస్‌టిడి సౌకర్యం పెట్టుకొని అమెరికాలోని తన కుటుంబ సభ్యులతో మాట్లాడి ఈ బిల్లులను రీకో సంస్థ చేతకట్టిస్తున్నట్లు తెలిసింది. ఎం.డి. ఆత్మకూరు రాకముందు ఎడిగా అనంతపురంలో పనిచేశారు. అక్కడ ట్రాన్స్‌ఫారాల కుంభకోణంలో బాధ్యుడైనందువల్ల ఎడికి 7నెలల వరకు అర్ధ జీతం మాత్రమే ఇవ్వమని ప్రభుత్వ ఆదేశాలున్నాయి. రీకో స్టోరులో మాయమైన సామానుల విషయమై విజిలెన్స్ దర్యాప్తు చేయిస్తే బాగుంటుంది.

### జోరుగా పేకాట

ఇందుకూరుపేట, తోటపల్లిగూడురు మండలాలలోని అనేక గ్రామాలలో పెద్దోళ్ల పేకాట పారాయణం జోరుగా, రంజుగా వుంది. శివరాత్రి రోజు వంటి మీద గుడ్డపోయేది కూడా తెలియక, మైకంలో తన్మయం చెందిపోయారు. ఊరికే ఆడితే పర్వాలేదు. డబ్బులు పెట్టి ఆడి దుమ్ములేపారు. ఇంట్లో ఉండే ఆడవాళ్లు తమ వారిని అదుపులో పెట్టుకోకపోతే, భారతంలో ధర్మరాజు పరిస్థితి దాపురిస్తుంది. వెనక చింతించి లాభం లేదు.

### బోర్లో నీళ్లు రావడంలేదు

ఇందుకూరుపేట మండలం పల్లిపాళెం గ్రామ కూడలి వద్ద జిల్లా పరిషత్

## జిల్లావార్తలు

వద్ద వుండే బోర్లో నీళ్లు రావడం లేదని మహిళలు గోలచేస్తున్నారు. మండలాధ్యక్షుడు కైలాసం ఆదిశేషారెడ్డి శ్రద్ధ తీసుకొంటే మంచిది.

### రోడ్డు వేయండి

కొత్తకోడూరు గ్రామం ఊళ్లో ఆర్‌అండ్‌బి రోడ్డు కొంత మేరకు వేసి ఒక కిలోమీటరు రోడ్డు వేయకుండా వదిలేశారు. రాళ్లు, రప్పల మీద ప్రయాణించాలంటే ఇబ్బందిగా వుంది. ఎమ్మెల్యే సోమిరెడ్డి

తరువ 11వ పేజీలో

# పేదోళ్లకు కరెంటోళ్ల షాక్!

ఉదయగిరి కరెంటోళ్లకు లంచం కట్నంగా చెల్లించలేదన్న అక్కసు, తమ బాధలు ప్రజా ప్రతినిధులకు, జిల్లా పాలకులకు తెలియజేశారన్న ఆగ్రహం కలగలిసి గండిపాళెం బిసి కాలనీ నివాసితులను గత ఐదు సంవత్సరాలుగా అష్టకష్టాలు పెడుతున్నారు. గండిపాళెంలోని బడుగు బలహీన వర్గాలు నివసించే బిసి కాలనీలోని నివాస గృహాల మీద రెండు మూడు అడుగుల ఎత్తులో, సబ్‌స్టేషన్ నుండి వింజమూరు వైపుకు వెళ్లే 11 కెవి విద్యుత్ లైను వెళ్తుంది. ఈ లైను తగిలి అమాయకులైన ఇద్దరు వ్యక్తులు ప్రాణాపాయం నుండి తప్పించుకొన్నారు. వేసవిలో కొంచెం గాలులు వీచినప్పుడు ఈ విద్యుత్ తీగలు ఒకదాని కొకటి తగులుకొని మంటలు రావడం, తీగలు తెగి కిందపడి పోవడం జరుగుతుంది. అలాగే ఒక రాత్రి తెగిన తీగలను తెల్లవారిన తర్వాత తొలగించే ఉద్దేశ్యంతో చేతపట్టుకొన్న తిరుపతయ్య అనే వ్యక్తికి తీవ్రంగా షాక్ కొట్టి చేతులు మొండిగా మారాయి. అలాగే మరొక పర్యాయం, మిద్దెపైన ఉసక్కాయలు ఎండబెట్టే ప్రయత్నంలో తీగలు తగిలి మరొక వ్యక్తి ప్రాణాపాయం నుండి తప్పించుకొన్నాడు. ఈ విధంగా జరుగుతున్న నేపథ్యంలో తొలివిడత పేదలను ఉద్ధరించేందుకు చంద్రబాబు నాయుడు ప్రభుత్వం ప్రవేశపెట్టిన ప్రజల వద్దకు పాలనలో ఆ కాలనీవాసులు, వచ్చిన అధికారులకు మొరపెట్టుకొన్నారు. అప్పట్లో స్పందించిన అధికార్లు వెంటనే తొలగించాలని ఆదేశించారు. ఈ ఆదేశాలు కరెంటోళ్లు ఖాతరు చేయలేదు. తిరిగి జన్మభూమి కార్యక్రమంలో తాము

### లంచాల పీడతో విల, విల!

శ్రమదానం ద్వారా లైను తొలగించుకుంటామని, దానికి అవసరమైన పరికరాలు ఇవ్వాలని కోరగా, అప్పుడు కూడా జన్మభూమి అధికార్లు స్పందించి తొలగించమని కోరగా, అప్పటి విద్యుత్ సెక్షన్ అధికారి, లైను తొలగించమని మాకు మామూళ్లు కట్నం చెల్లించకుండా అధికార్ల ద్వారా ఎలా చేయించుకొంటారో చూస్తామని పూరుకున్నారు. జన్మభూమి ద్వారా ఒక స్తంభం తొలగించాలంటే కనీసం 12 వేలు బాధితులు కట్టాల్సి వుంటుందని ఒక ఎస్టిమేషన్ తయారుచేసి జన్మభూమి అధికార్ల ఆదేశాలకు బ్రేకు వేసారు. కేవలం ఒక్క స్తంభం మార్పు చేసి లైను బదలాయింపుకు 12వేలు కట్టమని, కరెంటు వాళ్లు చేసిన డిమాండ్‌కు నోట మాటరాని ఆ పేదోళ్లు చేసేది లేక ఎవరికి చెప్పుకోవాలో అర్థం కాక, గడిచిన అసెంబ్లీ ఎన్నికల్లో మాజీ మంత్రి, మాదాల జానకిరాం, అప్పటి దేశం అభ్యర్థులుగా ఎమ్పీ, ఎమ్మెల్యేలుగా పోటీచేసిన కరణం బలరాం, కంభం విజయరామిరెడ్డిలకు మొరపెట్టుకొన్నారు. మీరు ఓట్లు వేయండి, విజయం వరించిన వెంటనే లైను

తరువ 8వ పేజీలో

# నెల్లూరు మున్సిపోల్స్ విశేషాలు

## వీధినపడ్డ ప్రేమకథ

నెల్లూరులో గతవారం రోజులుగా ఒక ప్రేమజంట కలకలం సృష్టిస్తుంది. మనసులు కలిసిన ఆ ప్రేమజంట మతాలు వేరుకావడమే. ఈ కలకలానికి కారణమనవచ్చు. మండపాల వీధికి చెందిన ధర్మన్న మార్వాడీ కుమార్తె టీనా, జండావీధికి చెందిన సందకోర్ కుమారుడు అల్తాఫ్‌ను ప్రేమించింది. ఈ విషయం తెలిసిన టీనా తల్లిదండ్రులు ఆమెను గత రెండు నెలలుగా ఇంట్లో నుంచి బయటకు రానీయకుండా కట్టడి చేశారు. కాని ఈ ప్రేమ పావురం ఎగిరిపోయింది. అబ్బాయిపై అమ్మాయి తల్లిదండ్రులు పోలీస్ స్టేషన్‌లో ఎత్తుకెళ్లాడని కేసు పెట్టారు. విషయం తెలుసుకున్న అమ్మాయి నేరుగా పోలీస్ స్టేషన్‌కు వెళ్లి తాను మేజర్‌నని, అల్తాఫ్‌కు తనకు పెళ్లి చేయమని సిఐ రమణారావును అభ్యర్థించింది. మామూలుగా అయితే పోలీసులు ఈ పెళ్లి జరిపించేవారే. మార్వాడీలు పోలీసులను కొనేయడంతో వాళ్లు మనసు మార్చుకొని అమ్మాయిను తమ కస్టడీలోకి తీసుకొని టౌన్‌లోని రెండు, మూడు లాడ్జిలలో మార్చి మార్చి మహిళా కానిస్టేబుళ్లను కాపలాపెట్టి వుంచారు. 13తేదీ టీనా, మురళీకృష్ణ హోటల్‌లో వున్న విషయం తెలుసుకొన్న అల్తాఫ్ జండావీధి నాయకులు సందాని, పమ్మి వారి అనుచరులను తీసుకొచ్చి హోటల్ వద్ద బైఠాయించారు. ట్రాఫిక్ స్తంభించింది. డిఎస్పీ, ఎఎస్పీ పరిస్థితిని అదుపు చేయలేక పోయేసరికి ఎస్పీనే సంఘటనా స్థలానికి వచ్చారు.

ప్రేమికుడు అల్తాఫ్, తన ప్రేయసిని అక్రమంగా పోలీసులు నిర్బంధించారని కోర్టుకు విన్నవించడంతో రెండవ అదనపు జుడీషియల్ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ శ్రీదేవి, టీనాను తన ముందు హాజరు పర్చమని పోలీసులను కోరారు. అమ్మాయి మనోగతం విన్న మేజిస్ట్రేట్‌ను టీనా తల్లిదండ్రులు తమ కుమార్తె మైనర్ అని నివేదించారు. దీనికి సాక్ష్యంగా వారి పెళ్లి కార్డు చూపారు. టీనా టెన్త్ సర్టిఫికెట్ చూపింది. దీంతో ఎటూ తేల్చుకోలేని న్యాయమూర్తి టీనా వయస్సు ధృవీకరణకు తిరుపతి రుయా ఆసుపత్రికి పంపారు. 19తేదీకి ఈ సర్టిఫికెట్ వస్తుంది. టీనాకు తాము రక్షణ కల్పించలేమని నెల్లూరు పోలీసు చేతు లెత్తేయడంతో న్యాయమూర్తి హైదరాబాద్‌లోని మహిళా రక్షణ కేంద్రంలో 18తేదీ వరకు ఉంచమని ఆదేశించారు.

ప్రతివీధిలో ఏదో ఒక ప్రేమ జంట వుంటుంది; వారికో కథ షరా మామూలే. కాని అల్తాఫ్ - టీనా ప్రేమవీధిలో పడింది. రెండు మతాల మధ్య ఆవేశకావేశాలు రగిల్చింది. బంగారంగళ్లు మూతపడ్డాయి. జండావీధి నుంచి అల్లరి మూకలొచ్చాయి. ఆర్ఎస్ఎస్, సిపిఎం పార్టీల జోక్యంతోసమస్య తీవ్రరూపం దాల్చింది. ఈ ప్రేమ వ్యవహారాన్ని వీధుల పాల్జేయటం ఆ కుటుంబాలకు, దీనికి మతం రంగు పులమి టౌన్‌లో ఉద్రిక్తతను కల్పజేసిన నాయకులకు ఇది క్షేమార్హం కాదు.

## బలపడ్డ బిజెపి

నెల్లూరు మునిసిపాలిటీకి జరిగిన ఎన్నికల్లో తెలుగుదేశం పార్టీతో పొత్తు కుదుర్చుకున్న కారణంగా, బిజెపి తన కౌన్సిలర్లను పెంచుకొని బలపడింది. గత కౌన్సిల్‌లో బిజెపికి 41వార్డు నుంచి కప్పిర శ్రీనివాసరావు ఒక్కడే ప్రాతినిధ్యం వహించేవారు. ప్రస్తుతం 3, 7, 14, 23, 41 వార్డుల్లో బిజెపి కౌన్సిలర్లు విజయం సాధించారు. వీరిలో 3, 7, 14 వార్డుల్లో గెల్చిన ముగ్గురు మహిళలు కావడం విశేషం.

## హ్యాట్రిక్ సాధించిన ముగ్గురు కౌన్సిలర్లు

నెల్లూరు మునిసిపల్ ఎన్నికల్లో ముగ్గురు కౌన్సిలర్లు వరుసగా మూడవసారి ఎన్నికై హ్యాట్రిక్ సాధించారు. కాంగ్రెస్ పార్టీ తరఫున ఈసారి గెల్చిన షేక్ షఫీ, ఈటుకూరు లక్ష్మయ్య. సిపిఎం పార్టీ తరఫున గెల్చిన వున్నం బసవయ్య గత రెండు కౌన్సిల్స్‌లో కూడా సభ్యులే. వైస్ ఛైర్మన్ వేలూరు దశరథరామయ్య, కోటాలక్ష్మి కుమారి ఈసారి ఎన్నికల్లో పోటీ చేయక హ్యాట్రిక్ అవకాశం కోల్పోయారు.

## భానుశ్రీ రికార్డు

నెల్లూరు మునిసిపాలిటి గత కౌన్సిల్‌లో ప్రాతినిధ్యం వహించిన నలుగురు మహిళలు ఎన్.భానుశ్రీ, అరిగెల రమమ్మ, ఏ. లక్ష్మమ్మ, షేక్ ఆసియా బేగంలు పోటీ చేయగా, తిరిగి భానుశ్రీ ఒక్కరే కౌన్సిలర్‌గా ఎన్నికయ్యారు. మహిళా కౌన్సిలర్లలో ప్రస్తుతం భానుశ్రీనే సీనియర్.

## పాపం... మీరారెడ్డి!

గూడూరు మునిసిపల్ ఛైర్మన్‌గా తన భార్య కల్పలతను బంపర్ మెజార్టీతో గెల్పించుకున్న కోడూరు మీరారెడ్డి తాను పోటీ చేసిన 7వార్డులో ఓడిపోయారు. భార్య తరఫున ప్రచారంలో మునిగితేలుతూ తన వార్డు సంగతి చూసుకోక పోవడంతో మీరారెడ్డికి ఇంతటి కష్టమొచ్చి పడింది. అయితే ఈ వార్డులో ఒక విచిత్రం జరిగింది. సిపిఎం తరఫున పోటీ చేసిన షేక్ కాలేషా ఎన్నికల చిహ్నం సుత్తి, కొడవలి, నక్షత్రం బదులుగా సిపిఐ ఎన్నికల చిహ్నం కంకి కొడవలిని అధికారులు ముద్రించి ఎన్నిక జరిపించి, ఓట్ల లెక్కింపు కూడా పూర్తి చేశారు. ఈ వ్యవహారమై సిపిఎం అభ్యర్థి ఎన్నికల కమిషన్‌కు ఫిర్యాదు చేశారు. ఎన్నికల కమిషన్ స్పందిస్తే ఈ వార్డులో మళ్లీ ఎన్నికలు జరుగుతాయి. ఈ ఎన్నికలో మీరారెడ్డిని విజయం వరిస్తుందని ఆశిద్దాం.

## శివప్రతాప్ కంటి ఆస్పత్రి ఆధునీకరణ

నెల్లూరు టౌన్‌లో మంచి హస్తవాసిగల కంటిడాక్టర్, సౌమ్యుడు బి. శివప్రతాప్‌రెడ్డి తన లలితా కంటి ఆసుపత్రిని ఈ నెల 12తేది ఆధునీకరించారు. మధుర, కోయంబత్తూరులకు పోనవసరం లేకుండా ఐఓల్ సర్జరీ, పాచిమెట్రితో కంటి స్కానింగ్, యాగ్ లేజర్ ట్రీట్‌మెంట్, గ్లౌకోమా, స్క్వింట్ సర్జరీలు, కాంటాక్ట్ లెన్సును కంటిలో బిగించడం, ఫాకో సర్జరీ, చెస్తారు. కుట్లు లేకుండా కాటరాక్ట్ నిర్మూలన, ఐఓల్ అమర్పు లలితా కంటి ఆసుపత్రిలో చేయించుకోవచ్చు. ఆధునీకరణ శుభారంభానికి మంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి, ఎమ్మెల్యేలు ఆనం వివేకానంద రెడ్డి, ఆనం రామనారాయణరెడ్డి విచ్చేశారు. ఆపరేషన్ థియేటర్‌ను హైదరాబాద్ గ్లోబల్ హాస్పిటల్ మేనేజింగ్ డైరక్టర్ డాక్టర్ కంచర్ల రవీంద్రనాథ్ ప్రారంభించారు. శివప్రతాప్‌కు మా అభినందనలు.

## మా అంచనా తప్పయి పోయింది!

మునిసిపల్ ఎన్నికల్లో మా అంచనా విఫలమైంది. నెల్లూరులో కాంగ్రెస్, కావలిలో తెలుగుదేశం గెలుస్తాయని గతవారం జోస్యం చెప్పాం. కాని అవి రెండూ జరగలేదు. ఏ ఎన్నికల్లోనైనా జనం నాడి ముందుగా పసి గట్టడంలో జమీన్‌రైతుకు ఒక విశిష్ట గుర్తింపు వుంది. ఈసారి ఆ ఆనవాయితీ తప్పింది. అందుకు ప్రధాన కారణం ఈ రెండు మునిసిపాలిటీలలోనూ ఓటర్లు పార్టీలను కాక వ్యక్తులను చూసి ఓటేయడం. ఇవి రమేష్‌రెడ్డి, యానాదిశెట్టిల విజయాలే తప్ప తెలుగుదేశం, కాంగ్రెస్‌ల గెలుపు కాదు. ఆ ఇద్దరు నేతల పట్ల జనంలో సదభిప్రాయం వుందని తెలుస్తున్నప్పటికీ - పార్టీలు, పరిస్థితుల ప్రాబల్యం ముందు వారి వ్యక్తిగత ప్రాభవం పనిచేయదని భావించాం; మా అంచనా విఫలమైంది. పాఠకులకు సరైన జోస్యం చెప్పడంలో గతి తప్పినందుకు మన్నింప మనవి.

నెల్లూరులో ఒక్క 12 వార్డు మినహా తతిమ కౌన్సిల్ వార్డులన్నింటిలోనూ మా అంచనా సరిపోవడం కొంతలోకొంత వూరట. గూడూరుకు సంబంధించి మాత్రం జోస్యం ఫలించింది. నిజానికి మేమే కాదు - యావత్ గూడూరు జనవాక్యం అదే చెప్తుండింది కాబట్టి - అందులోనూ మా ప్రత్యేకత కన్పించలేదు. నిజాయితీ ఒప్పుకొంటే - నిజం అంతే!

-సంపాదకుడు

## విజేతలకు అభినందనలు

ఏ. జయకుమారి
1వ వార్డు (దేశం)

పాట్టేటి చంద్రశేఖర్
2వ వార్డు (ఇండి)

సాదా ప్రసాదిని
3వ వార్డు (బిజెపి)

కాకర్ల గురవయ్య
4వ వార్డు (దేశం)

కిన్నెర ప్రసాద్
5వ వార్డు (దేశం)

ఎం. పెదసుబ్బరాయుడు
6వ వార్డు (దేశం)

ఎం. విజయలక్ష్మి
7వ వార్డు (దేశం)

బి. బుజ్జయ్య
8వ వార్డు (దేశం)

యం. శ్రీధరకృష్ణారెడ్డి
10వ వార్డు (దేశం)

కె. శ్రీనివాసులురెడ్డి
12వ వార్డు (దేశం)

షేక్ బాషా
13వ వార్డు (దేశం)

కిన్నెర కృష్ణమూర్తి
14వ వార్డు (బిజెపి)

కె.వి.స్వామినాయుడు
20వ వార్డు (దేశం)

నూని మల్లికార్జున
27వ వార్డు (దేశం)

భువనేశ్వరి
28వ వార్డు (దేశం)

జి. శమంతకమణి
33వ వార్డు (దేశం)

డి. సుబ్బారావు
38వ వార్డు (దేశం)

డి. అరుణ
41వ వార్డు (బిజెపి)

మన ప్రియతమ ముఖ్యమంత్రి, రాష్ట్రాభివృద్ధికి, బడుగు వర్గాల అభివృద్ధికి నిరంతరం కృషిచేస్తున్న శ్రీ నారా చంద్రబాబునాయుడు గారి ఆశీస్సులతో నెల్లూరు మున్సిపల్ ఎన్నికలలో ఛేర్‌పర్సన్ అభ్యర్థినిగా **శ్రీమతి తాళ్లపాక అనూరాధ గారికి, తెలుగుదేశం, బిజెపి, కాంగ్రెస్, సిపియం, స్వతంత్ర కౌన్సిలర్లను అత్యధిక** మెజార్టీతో గెలిపించిన పట్టణ ప్రజలకు, తెలుగుదేశం, బిజెపి నాయకులకు, కార్యకర్తలకు, పట్టణాభివృద్ధికి కృషిచేసే ప్రజల ఆదరాభిమానాలు పొందాలని ఆకాంక్షిస్తూ,

*నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలుపుచున్నాను.*

దారా జయరాజ్
42వ వార్డు (దేశం)

**షేక్ ఖాజావలి**, తెలుగుదేశం జిల్లా అడహాక్ కమిటీ సభ్యుడు, నెల్లూరు

# రాజకీయ కొండల్ని పిండిచేసిన గూడూరు

## కల్పలత గెలుపు పరమాద్భుతం

గూడూరులో స్వతంత్ర అభ్యర్థిని కోడూరు కల్పలత విజయం - పరమాశ్చర్యమే కాదు, పరమాద్భుతం కూడా! నేదురుమల్లి, నల్లపరెడ్డి వర్గాల మధ్య పాతికేళ్ల నుంచి నలిగిపోతుండిన గూడూరు రాజకీయానికి వర్గ విముక్తి కల్గింది ఎన్నికతో! అంతకు క్రితం కూడా వేమారెడ్డి రామచంద్రారెడ్డి, నల్లపరెడ్లు ఎటు గీత గీస్తే అటు నడిచేది గూడూరు రాజకీయం. కోడూరుమీరారెడ్డి ఆ కొండలన్నీ కదల బారేట్లు చేశారు. ఆయన సతీమణిది వట్టి గెలుపు కాదు - విశిష్ట విజయం. పోలైన 30,834 ఓట్లలో కల్పలతకు 45శాతం (17027) ఓట్లు వస్తే తెలుగుదేశం పార్టీకి అందులో సగం (8621); కాంగ్రెస్‌కి పాతిక వంతు (4179) మాత్రమే వచ్చాయి. వీరిద్దరికీ పడిన ఓట్ల కంటే కల్పలతకు వచ్చినవి ఎక్కువ. అంటే ఓటర్లు ఆ రెండు పార్టీలను నిర్మొగమాటంగా తిరస్కరించి, మీరయ్యను ఆదరించారు. మీరయ్య ముప్ఫయ్యేళ్ల వయస్సు కూడా లేని పనివాడు. రాజకీయ నేపథ్యం లేదు. అసలు గూడూరుకే ప్రవాసి. పూడిపర్తి అతడి స్వగ్రామం. పెరిగల్గినవాడు కాదు. విద్యార్థి రాజకీయాలలో చురుకుగా వ్యవహరిస్తూ ప్రజలతో కలిసి తిరగడం తప్ప ఏ ప్రత్యేకతా లేదు. అయినా అంత ఘనతర విజయం సాధించాడంటే - అందుకు కారణం ఆ రెండు పార్టీల స్థానికనేతల పట్ల ఓటర్లలో ఏర్పడిన ఏహ్యభావం మాత్రమేననడం నిజం. గత మూడు పర్యాయాలూ తెలుగుదేశం తరఫున గెల్చిన మునిసిపల్ ఛైర్మన్లు టౌన్ను భ్రష్టు పట్టించారు. మురికి కూపంగా మార్చారు. కాంట్రాక్టులు పంచుకోవడం, కమీషన్లు దండుకోవడం తప్ప చిల్లి గవ్వ పని చేసి ఎరుగరు వారు. వారికి ఓటేస్తే మరొకసారి మునిసిపల్ ఖజానాను దోచుకోవడం మినహా జరిగేదేమీ లేదన్న విరక్తి కల్గింది జనంలో! కాంగ్రెస్ పరిస్థితి చూస్తే - జనానికి దూరమై పోయింది. వేమారెడ్డి రామచంద్రారెడ్డి నిష్క్రమణ తర్వాత పార్టీ పూర్తి బాధ్యత ఎల్లసిరి గోపాలరెడ్డికి అప్పచెప్పారు జనార్ధనరెడ్డి గారు. ఆయన రాజకీయ శైలి జనానికి నచ్చదు. పది మందిని ఆకట్టుకొనే ప్రయత్నం ఆయనా చెయ్యడు. దానితో కాంగ్రెస్ ఒక పార్టీగా తన ఆధిక్యం కోల్పోయింది. ఈ పరిస్థితిని మీరయ్య చక్కగా సద్వినియోగం చేసుకున్నాడు. ఉత్సాహంగా పనిచేయడానికి ముందుకు వచ్చినా కాంగ్రెస్ నేతలు అణచివేయడానికి ప్రయత్నిస్తున్నారన్న భావం కార్యకర్తలలో ఏర్పడడంతో - వారందరూ మీరయ్య పట్ల సానుభూతి ప్రదర్శించి, ఏకీభావంతో సమర్థించారు.

మీరయ్య గెలుపుకు మరొక కారణం - రెడ్లలో ఐక్యత. రాకరాక రిజర్వేషన్ల ఉచ్చు తప్పించుకొని ఒక అవకాశం వచ్చిందనే సంతోషంతో వారందరూ ఏకమై పార్టీల ఎల్లలు చెరిపేసుకొని కలిసి పనిచేశారు.

మీరారెడ్డికి ఆవేశం ఎక్కువ. తొందర పాటు తనమూ జాస్తి. ఇంత కాలం అవే కాంగ్రెస్ పార్టీలో అతడికి ఒక గుర్తింపు తెచ్చాయి. కాని ఇక నుంచి పరిస్థితి వేరు. ముదనష్టంగా తయారైవున్న మునిసిపల్ పాలనను చక్కదిద్ద వలసిన బాధ్యత పైన పడింది. పసి వయస్సులో ఇంత మంచి అవకాశం లభించడం పూర్వ జన్మ సుకృతం. దాన్ని సద్వినియోగం చేసుకోగల్గితే గూడూరు రాజకీయాలలో మీరారెడ్డికి ఉజ్వల భవిష్యత్ వుంటుంది.

ఛైర్మన్ అభ్యర్థి విషయంలో ఏకీభావంతో వ్యవహరించిన గూడూరు ఓటర్లు కౌన్సిలర్ల విషయంలో మాత్రం చిందర వందర చేసేశారు. తెలుగుదేశం 9, కాంగ్రెస్ 7, బీజేపీకి 3, సిపిఎం ఒకటి, స్వతంత్రులు 8 మంది గెల్చారు. వైస్ ఛైర్మన్ ఎన్నిక విషయంలో సంఖ్యలు రెండు పార్టీలలోనూ చీకాకు పరుస్తున్నాయి. స్వతంత్రులు గోడ దూకే విధానంపై వైస్ ఛైర్మన్ ఎన్నిక ఆధారపడి వుంటుంది.

## నెల్లూరు

మొదటి పేజీ తరువాయి

తానొక్కడే జరిపించాడు. అందువల్ల ఇప్పుడు కాంగ్రెస్ ఓటమి తన ఓటమిగా భావించి కుమిలి పోతున్నారు. రాజకీయాలలో గెలుపు, ఓటమి సహజం. రెండింటినీ సమభావంతో స్వీకరిస్తేనే పరిణతి లభిస్తుంది. అందులోనూ ఆనం కుటుంబానికి ఎన్నికల్లో ఓటమి కొత్తకాదు. ఏసి. సుబ్బారెడ్డి నుంచి ప్రతి ఒక్కరూ పరాజయ పరాభవం చవిచూచిన వారే! అందువల్ల ఆయనంత కృంగి పోవలసిన అవసరం లేదు. కాని ఎందువల్లనో ఈ ఓటమిని వివేకా జీర్ణించు కోలేక పోతున్నారు. పాతికేళ్ల నుంచి రాజకీయాలలో వున్నా నాయకత్వ హోదాలో వ్యవహరించే అవకాశం లభించడం ఆయనకిదే ప్రథమం; అది సద్వినియోగం చేసుకోలేక పోయాననే దిగులు - కారణం కావచ్చు! ఎన్నికల బాధ్యతను తనంతట తానుగా టౌన్‌లోని కాంగ్రెస్‌వారు లందరికీ పంచి వుంటే ఇంతటి ఒంటరితనం ఏర్పడి వుండేది కాదు. అన్ని వర్గాల కాంగ్రెస్‌వారు లతో ఒక సమావేశం నిర్వహించక పోవడం వివేకా చేసిన తప్పు. భవిష్యత్ రాజకీయాలలో ఈ తప్పు సరిదిద్దుకోవడం అవసరం.

అభ్యర్థి ఓడినంత మాత్రాన ఎమ్మెల్యేగా ఆయనకు కల్గే రాజకీయ సమస్యలు ఏవీ లేవు. ఇదొక ఎదురు దెబ్బ - అంతే!

### సీనియర్లకుసందానేప్రతినిధి!

ఈసారి కౌన్సిలరేతటికి అత్యంత సీనియర్ సభ్యుడుగా నయ్యద్ సందాని బాషా మిగిలాడు. ఆయన్ను ఓడించడానికి సిపిఎంలోని ఒక కీలక వర్గం, తెలుగుదేశం నేతలు తలక్రిందుల తపస్సు చేసినా ఫలితం దక్కలేదు. సందాని కౌన్సిల్‌కు ఎన్నిక కావడం - ఇది నాలుగవ పర్యాయం. మరొక సీనియర్ సభ్యుడు వాట్ల నరసింహారావు ఓడిపోయాడు. 1981నుంచి అవిచ్ఛిన్నంగా గెలుస్తూ వచ్చిన ఆయన - వార్డుకు సంబంధంలేని మల్లిఖార్జున యాదవ్ డబ్బు ఖర్చు ముందు నిలవలేక పోయాడు. ఓటర్ల కొత్త మోజు - నరసింహారావు సౌశీల్యం, సంస్కారం, సేవా భావాలను నిష్ఫలం చేసింది. కెవి. రాఘవరెడ్డికి తగిన సీటు లభించి వుంటే గెల్చి వుండేవాడు. బ్యాడ్‌లక్ ఆయన వార్డులో ఆయన సతీమణి పోటీ చేసినా - 658 ఓట్ల ఆధిక్యత లభించిందిప్పుడు; రాఘవరెడ్డే అభ్యర్థి అయ్యే అవకాశం వుంటే పోటీయే వుండేది కాదు. రిజర్వేషన్ సమస్య రాఘవరెడ్డి కాళ్లకు బంధాలు వేసింది.

### నెల్లూరు రాజ్‌నారాయణ్

12వార్డులో తాను కూడా వూహించనంతటి మెజారిటీ (804)తో గెల్చి - జెయింట్ కిల్లర్‌గా గుర్తింపు పొందాడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి. ఆనం జయకుమార్‌రెడ్డి అక్కడి అభ్యర్థి కావడంతో - వివేకానందరెడ్డిపై కక్ష వున్న కాంగ్రెస్‌వారు లందరూ శీనయ్యకు అయాచిత సహకారం అందించారు. తన తమ్ముడు ఓడిపోవడం జరగని పని అనే ఆత్మ విశ్వాసంతో వుండిన వివేకానందరెడ్డికి కరెంట్ షాక్ వలె తగిలిందీ ఫలితం. శీనయ్య గెలుపుకు ప్రధాన కారణం - పాదాభివందనాలు. ఆయనకు ఓటేసిన ప్రతి ఓటరు పాదాలూ తాకి వుంటాడన్నది నిజం. శీనయ్య వంటి మిలిటెంట్ స్వభావి తెలుగుదేశంలో ఇమడడం చాలా కష్టం; చూడాలి!

### స్వయంకృతాపరాధం!

14, 17, 33 వార్డులలో కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమి కేవలం స్వయంకృతాపరాధం. అభ్యర్థుల ఎంపికలో నిర్మొగమాటంగా, స్పష్టంగా వ్యవహరించివుంటే ఈ మూడు స్థానాలూ చేజారేవి కావు. చివరి క్షణం వరకు తటపటాయించి, ఆశించే వారిలో ఆవేశం పెరిగిపోయిన తర్వాత టిక్కెట్లు పంచడంతో - కాంగ్రెస్ వెన్నుపోట్లే కాంగ్రెస్ అభ్యర్థులను ఓడించాయి. పసుపులేటి వెంకటేశ్వర్లుకు (14వార్డు) ఎప్పటి నుంచో రాజకీయ పదవీ మమకారం వుంది. ఇన్నాళ్లకు అవకాశం వస్తే - అదిట్లా నిష్ఫలమైంది. కలవకూరు విజయశేఖరరెడ్డికి కౌన్సిలర్ కావాలన్న ఆశ ఏకోశానా లేదు; చుట్టు ప్రక్కల చేరినవారు చెప్పిన చెప్పుడు మాటల వలలో చిక్కి 17వార్డులో ఓటమి చెందాడు. తిరుగుబాటు అభ్యర్థిగా రంగంలోకి దిగిన పెండి సురేష్ గెలుపు - నిజంగా ఆశ్చర్యకరం. ధనం, కులం, అనుచరబృందం, అండ ఏమీ లేకుండా ఒంటరి పోరాటం చేసి గెల్చాడు. మాజీ ఎమ్మెల్యే కెవి. సుబ్బారెడ్డి వార్డు ఇది; ఆయన అభ్యర్థికి తృతీయ స్థానం దక్కింది. ఇటువంటి అవమానాలు ఆయనకు అలవాటై పోయాయి; అయినా తాను నాయకుడ్నేనని దబాయించడం మాత్రం మానడం లేదు. రమేష్‌రెడ్డి ఆయనకు 17, 25, 30, 35 వార్డులప్ప చెప్పాడు. ఆయన అభ్యర్థులలో ఒక్క 25వార్డు మాత్రం చావు తప్పి, కన్నులొట్ట బోయినట్లు గెల్చింది. ఈ ఎన్నికతో టౌన్ రాజకీయాలలో కెవిఆర్ కుటుంబ పాత్రకు ఫుల్‌స్టాప్ పడినట్లే!

### ఖాజావలి లక్

రియల్ ఎస్టేట్ వ్యాపారి ఖాజావలి సోదరుడు బాషా - 13 వార్డులో గెలవడం నిజంగా అదృష్టం. సిపిఎం కేంద్ర కార్యాలయం వుండే ప్రాంతంలో వారి అభ్యర్థిపై 774 ఓట్లు ఆధిక్యత సాధించడం విచిత్రం. సిపిఎంతో పేచీ పెట్టుకొని, వివేకానుంచి కాంగ్రెస్ టిక్కెట్ తీసుకొని, తన అభ్యర్థిని పోటీకి పెట్టిన ఉపారాణికి పెద్ద ఆశాభంగం ఈ ఫలితం. ఆమె క్యాండిడేట్‌కు కనాకష్టంగా డిపాజిట్ మాత్రం తిరిగి వచ్చింది.

తెలుగుదేశంలో రియల్ హీరో - శ్రీధరకృష్ణారెడ్డి. ఆయన పోటీ చేసిన వార్డులో కాంగ్రెస్‌కు క్యాండిడేట్ దొరకలేదు. వైటి. నాయుడు తాను తెచ్చుకున్న రెండు టిక్కెట్లనూ గెల్పించు కోవడంతోపాటు- మరి రెండు వార్డులలో అదనంగా తెలుగుదేశం అభ్యర్థులను గెల్పించారు.

### ఎవరో కన్న బిడ్డకు తండ్రులు!

ఎవరి పుణ్యంతోనో కన్న బిడ్డకు తామే తండ్రులమని చెప్పుకొనే అల్పమానవ జాతి ఒకటి రాజకీయాలలో ఎప్పుడో వుంటుంది. ఈ ఎన్నికలలో ఆ జాతి సభ్యులకు నేతృత్వం వహిస్తున్నారు - ఆనం సంజీవరెడ్డి గారు టౌన్‌లో కాంగ్రెస్ అభ్యర్థి ఓటమికి, 12, 33 వార్డులలో ఆనం కౌన్సిల్ క్యాండిడేట్ల పరజయానికి తానే కారకుడనని చెప్తున్నారాయన. కాళ్లు వంగని ముదుసలి ప్రాయంలో మగతనం తగ్గలేదని మీసాలు నవరించు కొంటున్నారు. సంజీవరెడ్డి గారి కోడితోనే తెల్లారే పనైతే - కాంగ్రెస్‌లో ఎప్పుడూ పొద్దు పొడిచే వుండదు. ఎందుకీ ప్రగల్భాలు? *

| నెల్లూరుమునిసిపల్ ఛైర్మన్‌పదవికి పోటీ చేసినవారు పొందిన ఓట్లు | | |
|---|---|---|
| మొత్తం ఓట్లు | | 2,61,080 |
| పోలైన ఓట్లు | | 1,31,907 |
| చెల్లనివి | | 2,805 |
| అభ్యర్థి పేరు | పార్టీ | పొందిన మొత్తం ఓట్లు |
| 1. తాళ్లపాక అనూరాధ | (టిడిపి) | 69,561 |
| 2. మందా అంజమ్మ | (బిఎస్పి) | 696 |
| 3. కామంచి శేషమ్మ | (ఇండి) | 503 |
| 4. పత్తిపాటి వెంకటసుబ్బమ్మ | (ఎన్సిపి) | 541 |
| 5. పల్లంరెడ్డి యశోధర | (కాంగ్రెస్) | 57,561 |
| | మెజార్టీ | 11,760 |

| కావలి మునిసిపల్ ఛైర్మన్‌పదవికి పోటీ చేసినవారు పొందిన ఓట్లు | | |
|---|---|---|
| పోలైన ఓట్లు | | 36,041 |
| చెల్లనివి | | 614 |
| అభ్యర్థిపేరు | పార్టీ | పొందిన మొత్తం ఓట్లు |
| 1. గ్రంధి యానాదిశెట్టి | (కాంగ్రెస్) | 18,267 |
| 2. కేతిరెడ్డి రామకోటారెడ్డి | (టిడిపి) | 16,304 |
| 3. గద్దె సురేష్‌బాబు | (ఇండి) | 60 |
| 4. కె. మల్లిఖార్జునరెడ్డి | (ఇండి) | 33 |
| 5. ఉ. వెంకట రమణయ్య | (ఇండి) | 89 |
| 6. వంటేరు కొండారెడ్డి | (ఇండి) | 70 |
| | మెజార్టీ | 1963 |

## కావలి

మొదటి పేజీ తరువాయి

నరసింహం విజయం సాధించారు. 3వార్డులో రాంకోటారెడ్డికి గట్టి పట్టు ఉండగా యిక్కడ అనూహ్యంగా కాంగ్రెస్ అభ్యర్థి శీనయ్య విజయం సాధించారు. 4వార్డులో డబ్బుకు దాసోహం అన్న ఓటర్లు కాంగ్రెస్ వారు ఇచ్చిన వెండి కుంకుమ భరిణల కంటే, బిజెపి వారిచ్చిన చీరలకు, డబ్బుకు లొంగి, బిజెపిని గెలిపించారు. 5వార్డులో దేశం అభ్యర్థి ఉప్పాల మురళీకృష్ణకు విజయం సునాయాసమయ్యింది. 6వార్డులో కాంగ్రెస్‌కు గట్టి పట్టు వుండగా, ఇక్కడ ఎన్నికలకు రెండు రోజుల ముందు కులం ప్రాధాన్యత వహించడంతో, దేశం అభ్యర్థిని శిరీష గెలుపొందింది. 7వార్డులో కాంగ్రెస్, దేశం అభ్యర్థులిద్దరూ ముస్లింలు కావడంతో భారీగా ముస్లిం ఓట్లు చీలిపోయాయి. కాంగ్రెస్‌కు కేవలం 2ఓట్ల తేడాతో విజయం చేజారిపోయింది. 8వార్డులో ముందు అనుకున్న విధంగానే సామ్యుడుగా పేరుగాంచిన కాంగ్రెస్ అభ్యర్థి పఠాన్ నవాబ్‌ఖాన్ విజయం సాధించారు. 9వార్డులో సాంఘిక కార్యకర్త అయిన మొలతాటి హేమలత కాంగ్రెస్ అభ్యర్థిగా విజయం సాధించారు. 10వార్డులో దేశం గెలుపు మొదట్నుంచే ఖాయమయ్యింది. 11వార్డులో బిజెపి గాలి అలాగే వుండడంతో ఇక్కడ పట్టణంలోని అన్నివార్డుల కంటే ఎక్కువగా 363ఓట్ల భారీ మెజార్టీతో విజయలక్ష్మిని విజయం వరించింది. 12వార్డులో 'దేశం' రెబల్ అభ్యర్థి ముందు అనుకున్న దానికంటే ఎక్కువగా ఓట్లు చీల్చడంతో ఇక్కడ కాంగ్రెస్ అభ్యర్థి విజయం సాధించింది. ఇక్కడ దేశం రెబల్ అభ్యర్థికి 105ఓట్లు వచ్చాయి. 13వార్డులో మొదటినుండి దేశం అనుకూలత వుంది. కాబట్టి యిక్కడ తేలికగా దేశం అభ్యర్థిని సమదున్నీసా అభ్యర్థి విజయం సాధించింది. 14వార్డులో కాంగ్రెస్ కంచుకోట,ఇక్కడ ఈ పార్టీ అభ్యర్థి డేవిడ్ విజయం సాధించారు. 15వార్డులో ఒకసారి బిజెపి వైపు మొగ్గు చూపించినా యిప్పటికి రెండు సార్లు విజయం సాధించిన కాంగ్రెస్ అభ్యర్థి నున్నా వెంకట్రావు తిరిగి మూడోసారి యిక్కడి నుండి విజయం సాధించారు. 16వార్డు కాంగ్రెస్ కంచుకోట అన్నది మరోసారి ఇక్కడ కాంగ్రెస్ అభ్యర్థి విజయం సాధించడంతో నిజమని తేలిపోయింది. 17వార్డులో బిజెపి అభ్యర్థి విజయానికి అనూహ్యంగా దూరమయ్యారు. మతతత్వ బిజెపిని ఓడించాలన్న ఏకైక నినాదంతో సిపిఎం అభ్యర్థి పఠాన్ కాలేషా భారీగా (155) ముస్లిం ఓట్లను చీల్చడంతో, యిక్కడ కాంగ్రెస్ అభ్యర్థి విజయం సాధించారు. 18వార్డులో ముందు అనుకున్న విధంగానే దేశం అభ్యర్థి జ్వాలా సుబ్రహ్మణ్యం విజయం సాధించారు. 19వార్డులో గ్రంధి యానాదిశెట్టి తన చక్రం తిప్పారు. తన స్వంత వార్డులో గట్టి ప్రయత్నం చేయడంతో, బలహీనమైన కాంగ్రెస్ అభ్యర్థి శ్రీనివాసులుకు విజయం చేకూర్చగలిగారు. 20వార్డులో దేశం విజయం సాధిస్తుందని అనుకోగా, గ్రంధి అనుచరుడు మాజీ కౌన్సిలర్ నారాయణ గట్టి కృషి చేయడంతో, యింత వరకు ఊరు, పేరు తెలియని కాంగ్రెస్ అభ్యర్థి దారా బాబు విజయం సాధించారు. 21వార్డులో దేశం గాలి మారక పోవడంతో యిక్కడ దేశం అభ్యర్థి రాజారావువిజయం సాధించాడు. గ్రంధికి పట్టున్న 22, 23వార్డుల్లో కాంగ్రెస్ విజయం సాధించింది. 24వార్డులో స్థానికుడయిన దేశం అభ్యర్థికి మొదట అనుకూలంగా వుండగా, గ్రంధి ప్రభావం యిక్కడ ఎక్కువగా వుండడంతో, కాంగ్రెస్ అభ్యర్థి తిరిపాలు విజయం సాధించారు. 25వార్డులో పరిస్థితి ఎటు చెప్పలేని స్థితిలో వున్నప్పటికి యిక్కడ, కాంగ్రెస్ విజయం సాధించింది. 26వార్డులో దేశం విజయ కోసం కొండపనాయుడు చేసిన కృషి వృధా అయిపోయింది. భారీగా డబ్బు ఖర్చు పెట్టడంతో ఇక్కడ కాంగ్రెస్ అభ్యర్థి రాజ్‌కుమార్ విజయం సాధించాడు. 27వార్డులో దేశం అభ్యర్థి విజయం ముందుగానే ఖాయం అయ్యింది. 28వార్డులో బిజెపికి అనుకూలంగా వున్నప్పటికి చివరన పరిస్థితి మారిపోయి, కాంగ్రెస్ అభ్యర్థిని సునీత విజయం సాధించింది.

### పనిచేసేవారికే గెలుపు - గ్రంధి

ప్రజలకు అందుబాటులో ఉండి, పని చేసే వారినే కావలి పట్టణ ప్రజలు గెలిపించారని, ఛైర్మన్‌గా గెలిచిన గ్రంధి విజయానంతరం వ్యాఖ్యానించారు. పట్టణ పారిశుధ్యం, త్రాగునీరు సమస్యలపై దృష్టి పెడతానన్నారు. విద్యుత్, డ్రైనేజీల వ్యవస్థ సక్రమంగా వుండేందుకు కృషి చేస్తానన్నారు. యికముందు కూడా పట్టణ ప్రజలకు అందుబాటులో వుంటి, వారి అవసరాలు తీరుస్తానని వాగ్దానం చేశారు. *

# నెల్లూరు సంగతులు

4వ పేజీ తరువాయి

మాట్లాడుతూ రామన్న ఖరీఫ్ సీజన్‌లో రెండవ కారు పంటలు పండించేందుకు ఒక నెల ముందుగానే పంటలు సాగుచేసు కొనేటట్లు ప్రణాళిక రూపొందిస్తున్నట్లు చెప్పారు. గతంలో జరిగిన సాగునీటి సలహా బోర్డు సమావేశంలో లక్షా 35వేల ఎకరాల్లో పంటవేసుకోమని సలహా యిస్తే రైతులు 4లక్షల ఎకరాల్లో సాగు చేశారు. అయితే పంట ఎండి పోకుండా చేసేందుకు కృష్ణజలా లను కూడా తెచ్చిన విషయాన్ని మంత్రి గుర్తు చేస్తూ, రైతులు ఈసారికి సహకరించా లన్నారు. సమావేశానికి ఇద్దరు ఎమ్మెల్యేలు బల్లి దుర్గాప్రసాద్‌రావు, పరసా రత్నం మాత్రమే వచ్చారు.

## మనోహరంగా సాగిన గేయధార

సింహపురి సంగీత సభ యాజ మాన్యంలో వెంకటగిరి మాజీ సంస్థానాధీశుడు డాక్టర్ సాయికృష్ణ యాచేంద్ర 12తేది టౌన్‌హాల్‌లో తన సంగీత గేయధార ద్విశత ప్రదర్శనను నిర్వహించారు. సంగీత సభ కార్యదర్శి బి.వి. నరసింహం స్వాగత వచనాలు పలుకుతూ అష్టావధానకళకు నేటి గేయధార కార్యక్రమానికి గలపోలికలను వివరిస్తూ పండిత పామర జనరంజకంగా రూపుం దుకున్న సంగీతావధాన వైశిష్ట్యాన్ని వివరించారు. తొలి గేయధార ప్రదర్శన జరిగింది నెల్లూరు పట్టణంలో నన్న విషయాన్ని గుర్తు చేశారు. ప్రముఖ సాహితి విమర్శకులు జానుమద్ది హనుమచ్ఛాస్త్రి హరిహర తత్త్వంలోని సమరస భావాన్ని వర్ణించమని వస్తు నిర్దేశం చేశారు. హరి ఎవరు - హరుడెవరు - అవలోకించిన ఇద్దరూ ఒకటే అంటూ యాచేంద్ర కానడ రాగంలో ఆలాపన చేశారు. అదే గీతాన్ని మోహనరాగంలో వినిపించమని సినీ గాయని పి. సుశీల కోరగా పాడి శ్రోతల నానంద పరవశుల్ని గావించారు. సాయికృష్ణ యాచేంద్ర డాక్టర్ కె. మెహర్‌మణి తొలి గేయధార నుంచి నేటి 200 గేయధార వరకు గల అనుభూతిని వర్ణించమని కోరగా గురుదేవుల దీవెనలతో పయనం సాగింది అంటూ శ్రోత స్వినీరాగంలో గానాలాపన గావించారు.

బి.వి. నరసింహం ఇటలీ - ఇరాక్ - జపాన్ - చైనా పదాలు వుపయోగించుతూ తెలుగుదనం ఉట్టి పడేలాగా జావళి వినిపించమన్నప్పుడు యాచేంద్ర వెనువెం టనే 'పొద్దు పోయిరాకరా - ముద్దుల కృష్ణా - ఇట లీలలు సాగించి ఎద పీణలు మ్రోగిం చి - నీ నామ జపాను శిలనము - నిత్య కళ్యాణమే. మంచైనా, చెడైనా నీ లీలలు తలచిన చాలునురా అని విరహ భావభరి తంగా మంజుల గానాలాపన చేశారు. గేయ ధారలో నిర్దేశకులుగా రావి కొండలరావు, వెన్నెలకంటి రాజేశ్వరప్రసాద్, ఎ. అప్పల రాజా, మాధవపెద్ది సురేష్, కెవిఎస్. ఆచార్య, కరిమద్దెల నరసింహారెడ్డి వ్యవహరించారు.

ద్విశత గేయధార ప్రదర్శనను పూర్తిగావించిన సాయికృష్ణ యాచేంద్రను అభినందించి సన్మానమందిచడానికి విచ్చే సిన గాయని పి. సుశీల మాట్లాడుతూ పూర్వం రాజులు కళలను పోషిస్తే నేటి కాలంలో ప్రజలే ప్రభువులు కనుక కళాపోషకులు ప్రజలే అవుతున్నారు. రాజులూ ప్రజలతో చేరి కళారాధకులౌతున్నారని ప్రశంసించారు. ఎం.ఎస్. బాలసుబ్రహ్మణ్యశర్మ, మేడసాని మోహన్, జిల్లా కలెక్టర్, శ్రీమతి శ్రీలక్ష్మి సభకు విచ్చేసి యాచేంద్రను అభినందిం చారు. సినీనటులు సుత్తివేలు, కోట శంకర రావు, సంగీత సభ అధ్యక్షులు ఆర్వీనాగరాజు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కంప్యూటర్లు మొరాయిస్తున్నాయి

నెల్లూరు రైల్వే స్టేషన్ రిజర్వేషన్ కౌంటర్‌లోని కంప్యూటర్లు తరచూ మొరాయి స్తుండడంతో ప్రయాణీకులు పడరానిపాట్లు పడుతున్నారు. కౌంటర్‌లో వున్న కంప్యూటర్లు పాతవి కావడం వల్ల, సరైన నిర్వహణ లేక పోవడం వల్ల ఇవి తరచూ మొరాయిస్తున్నట్లు తెలిసింది. కంప్యూటర్ల పుణ్యమా అని రిజర్వేషన్ చేయించుకోను వెళ్లిన వ్యక్తులు కనీసం మూడు గంటల పాటు క్యూలో నిలబడాల్సి వస్తుంది. రైల్వే స్టేషన్ మాస్టర్ ఈ కంప్యూటర్ల సంగతి పట్టించుకొంటే బాగుంటుంది.

## టెలికాం శాఖ మూలంగా ప్రాణాలు పోయాయి

టెలిఫోన్ కొత్త కేబుల్ వేయను త్రవ్విన గుంటలో పడి మరణించిన వృద్ధుడి వైనమిది. నెల్లూరు కుసుమ హరిజనవాడలో టెలిఫోన్ కేబుల్స్ వేయను గుంటలను రెండు వారాల క్రితం త్రవ్వారు. వీటిని పూడ్చక పోవడం వల్ల 12తేది ఈ ప్రాంతానికి చెందిన నాగెట్టి అన్నామలై (70), మునిసిపల్ నీటి కోసం గుంటను దాటుతూ పొరపాటుగా దీనిలో పడిపోయాడు. ఈ విషయాన్ని చూసి కోళాయి దగ్గరవున్న వ్యక్తులు ఆసుపత్రికి చేర్చే లోపుగానే అన్నామలై మరణించాడు. టెలికాం శాఖ జోన్‌లో ఎక్కడపడితే అక్కడ ఇష్టమొచ్చినట్లు గుంటలు త్రవ్వేస్తుంది. వీటి వద్ద ఎటువంటి ప్రమాద హెచ్చరికలు పెట్టడం లేదు. వీటి మూలంగా పట్టణంలో ఇప్పటి వరకు ఎన్నో ప్రమాదాలు జరిగాయి. అన్నామలై మరణం తర్వాతనైనా టెలికాం శాఖ తనధోరణిని మార్చుకొని ఈ గుంటలు త్వరగా పూడ్చిస్తే బాగుంటుంది.

## తపాలా ఉద్యోగుల ధర్నా

అపరిష్కృతంగా వున్న తపాలా మరియు ఇడి ఉద్యోగుల సమస్యల సాధన కొరకు పోస్టల్ ఉద్యోగుల జాయింట్ యాక్షన్ కమిటీ ఇచ్చిన పిలుపు మేరకు నెల్లూరులో పెద్ద పోస్టాఫీసు వద్ద పోస్టల్ సిబ్బంది 15తేది ధర్నా చేశారు. జస్టిస్ తల్వార్ ఇ.డి. కమిటీ ఇచ్చిన నివేదిక, ఎల్.ఎస్.జి., బి.సి.ఆర్. గ్రూప్ డి ఉద్యోగుల జీతాలు పెంపుదల, పోస్ట్‌మెన్ స్కేలు పెంచకపోతే 24తేది సమ్మె నోటీసు ఇచ్చి, మే 2తేది నుంచి నిరవధిక సమ్మె చేస్తామని ప్రకటించారు. ధర్నాలో జెసిఎ నాయకులు జయప్రసాద్, ఎన్.రామ్మూర్తి, ఎ. శ్రీనివాసులు తదితరులు పాల్గొన్నారు.

## ప్రజాసేవను కొనసాగిస్తాను

నెల్లూరు 12వార్డు నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసి, ఓడిపోయినా ప్రజాసేవను కొనసాగిస్తానని ఆనం జయకుమార్‌రెడ్డి చెప్పారు. గెలుపు - ఓటములు తాత్కాలికాలు. ఆ వార్డుల్లో దీర్ఘ కాలంగా వున్న సమస్యల పరిష్కారానికి ద్విగుణీకృత ఉత్సాహంతో పనిచేసి, వార్డుల్ పార్టీ ప్రతిష్ట పెంచుతానన్నారు.

## కథాకళి

4వ పేజీ తరువాయి

సలహాలు తీసుకొంటాను. జోన్‌లో అండర్ గ్రౌండ్ డ్రైనేజీ సిస్టమ్, శానిటేషన్ మెరుగుకు అన్ని చర్యలు చేపడతానన్నారాయె. విజయమహల్ బాక్స్‌డ్రైవ్ బ్రిడ్జి పని ఏళ్లతరబడి ముందుకు కదలడం లేదు. దాన్ని పూర్తి చేయించి బాలాజీనగర్, ఎసి నగర్ ప్రజల కడగండ్లు తీరుస్తాను. రైలు కట్టకు తూర్పు వైపున వున్న ప్రజలకు పెన్నీళ్లు అందించే ప్రయత్నం ఆరంభిస్తాను. పట్టణ శివారు ప్రాంతాల్లో రోడ్లు, మురుగునీటి కాల్వలు, వీధిలైట్లు వేయించడంతోపాటు దోమల బెడద నుంచి ప్రజలను రక్షించను కార్యాచరణను రూపొందిస్తాను. ఆత్మకూరు బస్టాండ్ వద్ద ఫ్లైఓవర్ బ్రిడ్జి నిర్మాణం చేయాలి. ఈ పనులన్నీ చేయించేందుకు హడ్కో, ఎస్‌జెఎస్‌ఆర్‌వై, ఎస్‌డిపి నిధులను సాధిస్తానన్న ఆకాంక్షను వ్యక్తం చేశారు.

## షాక్

5వ పేజీ తరువాయి

తొలగింపుకు చర్యలు చేపడతామన్నారు. గెలిచిన తర్వాత కరణం అసలు కనిపించక పోగా, కంభం మాత్రం రెండు, మూడు పర్యాయాలు స్వయంగా విద్యుచ్ఛక్తి అధికార్లను కలిసి లైను తొలగించమని గట్టిగా చెప్పి హామీ పొందారు. అయితే ఇవి గిట్టని విద్యుత్ అధికార్లు లైను తొలగించక పోగా, మరింత వేధించసాగారు. మేము ఇక్కడ ఉద్యోగాలు చేసినంత కాలం ఎమ్మె కాదు, ఎమ్మెల్యే కాదు, స్వయంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చెప్పినా మార్చబోమని మొండికేసి వేధిస్తున్నారు. అంతేగాక మరింత వేధింపు అన్నట్లుగా ఆ ఇంటికి ఆనుకొని సురక్ష పవర్ ట్రాన్స్‌ఫారం బిగించేందుకు స్తంభాలు వేయగా అక్కడ స్థానికులు ఆగ్రహం వ్యక్తం చేసి అడ్డుకున్నారు. ప్రస్తుతం వేసవి సమీపిస్తుండడం, పెను గాలులు, కొండ గాలులు జ్ఞాపకం వస్తుండడంతో ఆ కాలనీ వాసులు గుండెలు బాదుకొంటున్నారు. కరంటోళ్లు ఎక్కడైనా అక్రమ విద్యుత్ కనెక్షన్‌లు, విద్యుత్ వైర్లు, ఇతర పద్ధతులు ద్వారా జేబులు నింపుకోవడం చాలక, ఇలా ఏమీ తెలియని పేద అమాయకులను వేధించడం మానుకొంటే మంచిది. లేకుంటే సమయం చిక్కినప్పుడు చితక బాధక తప్పదు. ఉన్నతాధికార్లు అంత వరకు ఈ విషయం పోనీయక సరిదిద్దాల్సి వుంది.

కన్నయ్య మనుమడు, వడియాల వెంకట సుధాకర్ కుమారుడు, వెంకట సునీల్, సుస్మిత వివాహం 12 తేది నెల్లూరు దర్గామిట్టలోని కృష్ణమందిరంలో జరిగింది

## యశోధర

4వ పేజీ తరువాయి

ఉత్కంఠ భరిత పరిస్థితి ఏర్పడింది. తెలుగుదేశం అభ్యర్థి కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి మెజార్టీ పెరుగుతుండడంతో ఆనం వర్గీయులు ఇక్కడ నుంచి నిష్క్రమించారు. ఇండిపెండెంట్ అభ్యర్థిగా పిండి సురేష్ గెల్చిన 17, బిజెపి అభ్యర్థి కన్నెర కృష్ణమూర్తి గెల్చిన 14వార్డుల్లో కూడా గెల్చిన వారికి మెజార్టీ తక్కువ రావడంతో ఓడినవారు లబోదిబో మనడం కన్పించింది. రెండవ రౌండ్‌లో 4 కౌన్సిల్ స్థానాలు గెల్చుకొన్న కాంగ్రెస్‌లో కాస్త ఉత్సాహం కనపడింది. ఈ రౌండ్‌లో తెలుగుదేశం ఛైర్మన్ అభ్యర్థినికి 19,450, కాంగ్రెస్ అభ్యర్థిని యశోధరకు 17,146 ఓట్లు వచ్చాయి. మూడవ రౌండ్‌లో కౌంటింగ్ జరిగిన 27వార్డులో సీనియర్ కాంగ్రెస్ కౌన్సిలర్ చాట్ల నరసింహారావు ఓడిపోవడం కాంగ్రెస్ శిబిరంలో కలకలం బయలు దేరింది. ఈ రౌండ్‌లో 6 కౌన్సిల్‌స్థానాలను కాంగ్రెస్ గెల్చుకొంది. ఈ రౌండ్‌లో తెలుగుదేశం ఛైర్మన్ అభ్యర్థినికి 14,077, కాంగ్రెస్ ఛైర్మన్ అభ్యర్థినికి 14,449 ఓట్లు వచ్చాయి. 4వ విడత వార్డుల కౌంటింగ్ ఆరుగంటలు దాటాక మొదలయ్యింది. హేమాహేమీలు పోటీ చేసి ఉండడంతో ఫలితాల కోసం కౌంటింగ్ హాలు బయట కూడా ఉత్కంఠత నెలకొనింది. కాంగ్రెస్ కౌన్సిలర్‌గా పుట్టా రామకృష్ణారెడ్డి, నల్మా బషీర్, షఫీ, సందానీబాషా, పెంచల నరసింహారావు, ఊటుకూరు నాగేశ్వరరావు ఈ రౌండ్‌లోనే గెల్చారు. రాత్రి 8.45 నిమిషాలకు తెలుగుదేశంకి 15కౌన్సిల్ స్థానాలు, కాంగ్రెస్ 17స్థానాలు, సిపిఎం, బిజెపి చెరి ఐదు, ఇండిపెండెంట్లు 2స్థానాలు గెల్చుకొన్నట్లు, ఛైర్మన్‌గా తెలుగుదేశానికి చెందిన అనూరాధ 11,760 ఓట్ల మెజార్టీతో గెలుపు సాధించినట్లు ఎన్నికల అధికారి వేమారెడ్డి ప్రకటించారు. కౌంటింగ్ జరిగే తీరును జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి ఒకసారి పరిశీలించి వెళ్లారు. కౌంటింగ్ సెంటర్‌లో విలేఖరులకు ఫోను సౌకర్యం కూడా కల్పించక అధికారులు ఏడిపించారు. సిపిఎం పార్టీకి చెందిన నాయకుడొకరు, తనను అనవసరంగా తిట్టాడని కమీషనర్, విలేకరుల వద్ద వాపోతూ కనిపించారు. 43వార్డు ఫలితం ప్రకటన సమయంలో పరిస్థితి ఉద్రిక్తంగా మారినా పోలీసులు దగ్గరుండి వ్యవహారం పరిష్కరింపజేశారు.

# చదువుకోవాలని ఉందన్న రాశి!

**హైదరాబాద్ సినిమా వార్తలు**

తాను చిన్నప్పటి నుంచి సినిమాల్లో నటించడం మూలంగా స్కూల్ కెళ్లింది తక్కువేనని గ్లామర్ హీరోయిన్ రాశి చెప్పింది. చదువంటే పెద్దగా ఆసక్తిగా ఉండేది కాదు. షూటింగ్ నుంచి తిరిగి వచ్చి సాయంత్రం చదవాలంటే అలసిపోయి నందువల్ల ఏమో కానీ చదవాలనిపించేది కాదు. కాని చదువు విలువ చదివేటప్పుడు తెలియదు. అది మానేసిన తర్వాత తెలుస్తుంది. ఇప్పుడని పిస్తుంది. నాకు కూడా డిగ్రీ వుంటే బావుండుననని. అందుకే బిఏ చదవాలను కొంటున్నాను. కాని షూటింగ్‌ల వల్ల చదివే సమయం దొరకడం లేదు. అయితే ఏదో ఒకరోజుకు బిఏ పూర్తి చేయాలన్నదే తన కోరికని రాశి చెప్పింది.

## పవన్ కళ్యాణ్‌పై ప్రభావం చూపిన వ్యక్తి

సక్సెస్ హీరో పవన్ కళ్యాణ్ బద్రి షూటింగ్ గ్యాప్‌లో మాట్లాడుతూ మొనాలిసా పెయింటింగ్‌ని వేసిన చిత్ర కళాకారుడు లియొనార్డో డావిన్సీ జీవిత చరిత్రను చదివి చాలా ప్రేరణ పొందినట్లు చెప్పారు. లియొనార్డోకు ఒక చిత్ర కళలోనే కాదు, పలు రంగాల్లో ప్రావీణ్యత ఉంది. సివిల్, మిలిటరీ, ఇంజనీరింగ్, శరీర నిర్మాణం, జీవ శాస్త్రం, గణితం, భౌతిక శాస్త్రాల వంటి

కొరవ 11వ పేజీలో



యువరాజా చిత్రంలో సిమ్రాన్, మహేష్‌బాబు

# వేషాల్లేని తల్లీ - కూతుళ్లు

బాబీ హీరోయిన్ డింపుల్ కపాడియా, ఆమె కుమార్తెలు ట్వింకిల్ ఖన్నా, రింకీ ఖన్నా వేషాలు లేక ఇంట్లోకూర్చొని గోళ్లు గిల్లు కొంటున్నారు. డింపుల్ ఈ మధ్య తల్లి పాత్రలు వేసి వేసి అలసి పోయింది. తెలుగు చిత్రం శీనులో నటించిన ట్వింకిల్ ఖన్నా ఇండస్ట్రీలో ఫ్లాప్ హీరోయిన్‌గా ముద్రపడడంతో చిత్రాలేమీ లేక ఖాళీగానే వుంది. రింకీ ప్యార్‌మే కభీకభీ చిత్రం ఫ్లాప్ అయిన తర్వాత మళ్లీ కనపడలేదు. ఇంట్లో ఖాళీగా కూర్చోవడం ఇష్టం లేక వెరైటీ క్రొవ్వు వత్తుల తయారీకి శ్రీకారం చుడు తున్నారట.

## డింపుల్, ట్వింకిల్ బాధలే, బాధలు!

## గర్ల్ ఫ్రెండ్స్‌ను మార్చిన సల్మాన్‌ఖాన్

మైనేప్యార్ కియా చిత్ర హీరో సల్మాన్ ఖాన్ తరచూ తన గర్ల్ ఫ్రెండ్స్‌ను మార్చుతుంటాడు. ఈ లిస్టులో కొత్తగా చేరింది మిస్ యూనివర్స్ సుస్మితాసేన్. సల్మాన్‌ఖాన్ అత్యంత అందగత్తెలనే తన గర్ల్ ఫ్రెండ్స్‌గా ఎంపిక చేసుకొంటుంటాడు. సల్మాన్ ఒకప్పటి గర్ల్ ఫ్రెండ్ సంగీతా బ్రిజ్‌లానీ ఒకప్పటి మిస్ ఇండియా. ఆ తర్వాత గర్ల్ ఫ్రెండ్ ఐశ్వర్యారాయ్ మిస్‌వరల్డ్, సుస్మితాసేన్ కూడా ఒకప్పటి మిస్ యూనివర్స్. సల్మాన్ మంచి కళా పోషకుడన్నమాట.

## అజిత్ ప్రోత్సాహం

ప్రేమలేఖ ఫేం హీరో అజిత్ ఎన్నో కష్టాలు పడి చిత్ర పరిశ్రమలో హీరోగా నిలదొక్కు కొన్నాడు. విజయాలకు వీరవిగక, దీనికి కారకులైన దర్శకులను గౌరవించడం తన ధర్మంగా పెట్టుకొన్నాడు. వాలి వంటి సూపర్ హిట్ చిత్రాన్నిచ్చిన దర్శకుడు 'సూర్యా'కు అజిత్ సాంత్రోకారుని బహుకరిం చాడు. ఆ తర్వాత అమర్కళమ్, ముగవరి చిత్ర దర్శకులకు కూడా వరుసగా కార్లను కొన్నిచ్చాడు. తాజాగా తాను నటిస్తున్న సిటిజన్ చిత్ర దర్శకుడు శరవణ సుబ్బయ్యకు సుజుకీ బైక్ కొని ఇచ్చాడు. సుబ్బయ్యకు దర్శకునిగా ఇది మొదటి చిత్రం. బైక్‌తో వుబ్బితబ్బిబ్బైన సుబ్బయ్య ఈ రోజుల్లో కూడా ఇటువంటి హీరోలుండడం అరుదని అందరికీ చెబుతున్నాడు. *

# రంజుగా వున్న రంభ, సంఘవిల పోరు!

తమిళంలో కొత్తగా సినిమాలు లేని సంఘవి ఈ మధ్య ఓ నిర్మాతకు సెల్‌ఫోన్ చేసి మీ సినిమాలో వేషం ఇవ్వండి, పారితోషికం తర్వాత మాసుకుందాం. నేను చేసిన దానిని బట్టి నా పారితోషికం ఇవ్వండి. ముందు వేషం ఇచ్చి నా టాలెంట్ చూడమందట. ఈ మాటలకు ముగ్ధుడైన ఆ నిర్మాత అంతకు ముందు బుక్ చేసిన రంభను

## సినిమా ఛాన్సుల కోసం ఆరాటం

క్యాన్సిల్ చేసి తాజాగా సంఘవిని ఫైనల్ చేశాడట. ఈ విషయం తెలుసుకున్న రంభ అగ్గిమీద గుగ్గిలమై సంఘవికి ఫోన్ చేసి చెడామడా బూతులు తిట్టిందట. సంఘవి కూడా వీటికి లంఘించు కోవడంతో వేషాలు లేకుంటే ఇంతగా దిగజారాలా అని ఈ మధ్య కనపడిన ప్రతి ఒక్కరితో రంభ చెబుతుంది. గ్లామర్ పాపలైన రంభ - సంఘవిల లడాయి ఎంత వరకు పోతుందో?

## అభిమానుల ఉత్తరాలు పదే పదే చదువుతాను

కహోనా ప్యార్‌హై చిత్రం సూపర్ హిట్ అవడంతో ఎన్నో చిత్రాల్లో నటించే అవకాశం ఈ చిత్ర హీరోయిన్ అమీషా పటేల్‌కు వచ్చింది. చిత్రం విజయవంత మయ్యాక అభిమానుల దగ్గర నుండి రక రకాల ఉత్తరాలు వస్తున్నాయి. ఈ ఉత్రాలు చూస్తుంటే మనసు కరిగి పోతుంది. వీటిని షూటింగ్ స్పాట్‌లకు కూడా తీసుకెళ్లి గ్యాప్‌లో చదువుతున్నాను. ప్రేక్షకులు, అభిమానులు ఇచ్చే సలహా పాటిస్తే ఏ నటైనా అగ్రస్థానం అలంకరిస్తుంది. తాను ఆ బాటలోనే నడవాలను కొంటున్నట్లు అమీషా చెప్పింది.

## ముందు జాగ్రత్త

తమిళనాడులోని హీరోలు, దర్శకులు తాము సంపాదించిన డబ్బుతో షాపింగ్ కాంప్లెక్స్‌లు కొనేస్తున్నారు. ఒకే ఒక్కడు దర్శకుడు శంకర్‌కు సినిమాలో నిర్మాత కొంత షేర్ ఇవ్వడంతో ఆ డబ్బుతో టి.నగర్‌లో ఒక షాపింగ్ కాంప్లెక్స్ కొన్నారు. హీరోలు అజిత్, శివకుమార్, సూర్యలు ఇదే బాటన నడిచారు. తమ పేర్లు ఈ కాంప్లెక్స్‌లకు పెట్టడంతో ఈ ప్రాంతాలన్నీ గ్లామరస్‌గా తయారవు తున్నాయి. *

# రవ్వంత కూడా బాగాలేని 'రవన్న'

**చిత్రసమీక్ష**
**గ్రిద్దలూరు గోపాలరావు**

పోసాని కృష్ణమూర్తి వ్రాసిన కథలో రవన్న కథా నాయకుడు. రవన్న అసలు పేరు కొరటాల రవీంద్ర. అందరూ అతన్ని రవన్న అంటుంటారు. రవన్న మొరటువాడు. మూర్ఖుడు. ఈ పాత్రను రాజశేఖర్ పోషించాడు. దుర్గంధ రాజకీయాల్లో మునిగి తేలే యం.యల్.ఏ బుచ్చన్నను (జయ ప్రకాష్) రవన్న గుడ్డిగా అనుకరిస్తాడు. అభివృద్ధి పథకాలకు వినియోగించవలసిన డబ్బంతా బుచ్చన్న దిగమ్రింగుతుండటంతో ఆ ఊరు, కరెంటు, నీళ్లు, ఆసుపత్రి ఇలాంటి ప్రజోపయోగ కార్యక్రమాలకు నోచుకోదు. వీటన్నింటి గురించి రవన్న ఏమీ పట్టించు కోడు. బుచ్చన్నను చాలా మంచి వ్యక్తిగా భావిస్తూ అతను ఏ పని చెప్పినా వెంటనే చేసేస్తుంటాడు.

కార్గిల్ యుద్ధంలో ఒక చెయ్యి పోగొట్టుకున్న సైనికుడు, చౌదరికి అతని దేశభక్తికి మెచ్చి ప్రభుత్వం ఆ ఊళ్లో ఐదెకరాల పొలం మంజూరు చేస్తుంది. ఆ పొలం సాగుచేసుకునేందుకుగా చౌదరి (కృష్ణ) తన చెల్లెలు సరస్వతితో (సౌందర్య) ఆ ఊళ్లో స్థిరపడతాడు. అందరూ అతన్ని కార్గిల్ చౌదరి అని పిలుస్తుంటారు. సరస్వతి టీచరుగా ఆ ఊళ్లో చదువు చెప్తుంటుంది. దేశభక్తుడైన కార్గిల్ చౌదరి, దేశద్రోహియైన బుచ్చన్న కుళ్లు రాజకీయాన్ని ఎదిరిస్తాడు. కార్గిల్ చౌదరిని, సరస్వతిని అడ్డు తొలగించే పని రవన్నకు అప్పగిస్తాడు బుచ్చన్న. రవన్న, సరస్వతి మీద అత్యాచారానికి పూనుకుంటాడు. ఆమె కోర్టుకు వెళ్లుతుంది. కోర్టు తీర్పు ప్రకారం రవన్న, సరస్వతిని పెళ్లి చేసుకుంటాడు. రవన్న, కార్గిల్ చౌదరి మధ్య కొన్ని ఏక్షన్, సెంటిమెంటు దృశ్యాలు సాగిన తర్వాత, కార్గిల్ చౌదరి దేశభక్తి ఉపన్యాసాల వల్ల, రవన్న కళ్లు తెరుచు కుంటాడు. బుచ్చన్న నిజరూపం తెలుసు కుంటాడు. బుచ్చన్న దుర్మార్గాలను ఎదిరి స్తాడు. కిడ్నాప్ చెయ్యబడ్డ ముఖ్యమంత్రిని రక్షించటంలో రవన్న తుపాకి గుళ్లకు బలవుతాడు.

ఏక్షన్, సెంటిమెంటు, లవ్, ఎంటర్ టెయిన్‌మెంటు, దుర్గంద రాజకీయాలు ఇలా చాలా పాత విషయాలతో కూడుకున్న కథ చాలా పలచగా వుంది. ఏక్షన్, సెంటిమెంటు, లవ్, దృశ్యాలు చొకబారుగా వున్నాయి. ఆ వూరి సర్పంచ్‌గా (ఎం.ఎస్.నారాయణ) అందించిన హాస్యం ఎంటర్ టెయినింగుగా వుంది. రాజకీయ వాతావరణం చాలా చప్పగా చూపబడింది. రాజకీయమంతా ఎమ్మెల్యే బుచ్చన్న చుట్టూ తిరుగుతుంది. బుచ్చన్న ముఖ్యమంత్రి కావాలనుకోవటం, ముఖ్యమంత్రిని కిడ్నాప్ చేయించటం, అతన్ని చంపించాలని చూడటం ఇవన్నీ పాతకంపు కొట్తూ నీరసంగా వున్నాయి. ఎమ్మెల్యేను ఎవరో ఏదో తప్పు పట్టి చేయెత్తి చూపించటంతో రవన్న అతని చెయ్యి నరికి ఎమ్మెల్యే పాదాల వద్ద వుంచటం, సరస్వతిని ఊళ్లోనుంచి తరిమేసే ఉద్దేశ్యంతో, ఆమె స్నానం చేస్తున్న బాత్‌రూంలోకి రవన్న దూరి ఆమె ప్రక్కన నిలబడి స్నానం చెయ్యటం, రవన్న మనుషులు జాతీయ జెండాని అవ మాన పరచటం ఇలా ఇంకా కొన్ని దృశ్యాలు జుగుప్సాకరంగా వున్నాయి. కార్గిల్ చౌదరి నీతి, న్యాయం, దేశభక్తిని గురించి బోధించిన విధానంలో చురుకుదనం కనిపించలేదు. రాజ్‌కుమార్ సంగీతంతో చిత్రీకరించిన పాటల దృశ్యాలు కృత్రిమంగా ఒకే ధోరణిలో వెగటు వేస్తున్నాయి.

ముఖ్యమైన రవన్న, కార్గిల్ చౌదరి, బుచ్చన్న, సరస్వతి పాత్రల్లో జీవం కనిపించదు. ఈ పాత్రలు సమర్థనీయంగా లేనందువల్ల వీటిని పోషించిన రాజశేఖర్,

కొరవ 11వ పేజీలో

# వారఫలాలు

18.3.2000 తేది నుండి 24.3.2000 తేది వరకు; మేషంలో గురు, కుజుడు, శనులు; కర్కాటకంలో రాహువు; మకరంలో కేతువు; కుంభంలో బుధ, శుక్రులు; మీనంలో సూర్యుడు; సింహ, కన్య, తులలలో చంద్రుడు

## మేషం
(అశ్వని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆర్థికస్థితి గతంలో కంటె మెరుగు పడుతుంది. బిడ్డల వల్ల, బంధువుల కొరకు ఖర్చులు పెరుగుతాయి. ఆరోగ్యం సరిగా ఉండదు. విద్యాప్రగతి బాగుంటుంది. తల్లిదండ్రి బంధువుల అనారోగ్య వార్తలు వింటారు. అనుకున్న పనులు జరగడంలో ఆలస్యం ఉంటుంది. స్థిరాస్తుల క్రయవిక్రయాల వ్యవహారాలు నిలబడి పోగలవు. ఉద్యోగులు విధి నిర్వహణ సమర్థవంతంగా ఉంటుంది.

## వృషభం
(కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆర్థిక లావాదేవీలు, బాకీలు తొలగి పోతాయి. ఆదాయం బాగుంటుంది. ఉద్యోగ విధి నిర్వహణ సమర్థవంతంగా ఉండి, అధికారుల సహకారం, గౌరవ పలుకుబడులు బాగుంటాయి. సన్నిహితుల సహాయం పొందు తారు. వృత్తి, వ్యాపారాలలో మంచి అవకా శాలు లభిస్తాయి. అనుకున్న పనులు సక్ర మంగా జరుగుతాయి. విద్యాప్రగతి బాగుం టుంది. శారీరక, మానసిక శ్రమ పెరుగుతుంది. శుభవార్తలు వినడం జరుగుతుంది.

## మిథునం
(మృగశిర, 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

అన్ని రంగాల వారికి ఆర్థికస్థితి బాగుం టుంది. రాజకీయ ప్రయోజనాలు పొందుతారు. పలుకుబడి గౌరవం బాగుంటుంది. అధికారు లతో మైత్రి. వివాదాలకు పరిష్కారం, పెట్టుబడి రంగాలలో మంచి అవకాశాలు లభిస్తాయి. అధికార కార్యక్రమాలు సక్రమంగా నిర్వర్తిస్తారు. శుభవార్తలు వింటారు.

## కర్కాటకం
(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్లేషలు)

వృత్తి, వ్యాపార రంగాలలో ఆదాయం ఉంటుంది. వ్యవసాయదారులకు గిట్టుబాటు తక్కువ. అధికార కార్యక్రమాలు చక్కగా జరుపుతారు. కొత్త పరిచయాలు పలుకుబడి బాగుంటుంది. సన్నిహితులను, సహోద్యోగులను జాగ్రత్తగా గమనించుకోవాలి. మంచి విషయాలు వార్తలుగా అందుతాయి.

## సింహం
(మఖ, పుబ్బ, ఉత్తర 1వ పాదం)

రాజకీయపరమైన వత్తిడులుంటాయి. అనుకున్న పనులు జరుగక ఇబ్బంది పడతారు. విధి నిర్వహణలో ఉద్యోగులు జాగ్రత్తపడాలి. వ్యాపార అవకాశాలు బాగుంటాయి. పెట్టుబడుల వల్ల ఫలితం బాగుంటుంది. సమస్యలలోకి మిమ్ములను దించాలని ప్రయత్నిస్తారు కాబట్టి జాగ్రత్త పడండి. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. విద్యాప్రగతి బాగుంటుంది. దైవ, సాంస్కృతిక కార్యాలలో పాల్గొంటారు. ఆదాయం పెరిగినా ఖర్చులు బాధ తప్పదు. కుటుంబ సభ్యులకు అనారోగ్య బాధలుంటాయి. కొత్త వస్తువులు లభిస్తాయి.

## కన్య
(ఉత్తర 2,3,4 పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా ఉండదు. స్త్రీ మూలక ఖర్చులుంటాయి. మిమ్ములను కించపరచే ప్రయత్నాలు జరుగు తాయి. అనుకున్న పనులకు ఆటంకాలు, ఉద్యోగ బాధ్యతల వల్ల శ్రమ, అప్పు చేయవలసి పరిస్థితి ఉండటం, ఆదాయం తగ్గడం జరుగుతుంది. సన్నిహితులే సమస్యలు తెస్తారు.

## తుల
(చిత్త 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

సాధ్యమైనంత వరకు సమస్యల జోలికి వెళ్లకండి. అధికారపరమైన చిక్కులు ఏర్పడగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. స్థిరాస్తుల క్రయవిక్రయాలు, వస్తువులు నూతనమైనవి కొనడం, పలువురు ప్రముఖులతో పరిచయాలుంటాయి. కొద్ది ఆరోగ్య లోపం, గాయాలు తగలడం, అల్పులతో తగాదాలు ఉంటాయి.

## పంచాంగం

### ముహూర్తాలు

తేది 22 బుధవారం ఉదయం గం9.54లకు వృషభ లగ్నాన గృహారంభ, ఉపనయన, వివాహ, వ్యాపారాలకు. తేది 23 గురువారం ఉదయం గం11.36లకు మిథున లగ్నాన వ్యాపార, అక్షరాభ్యాస, వివాహాది శుభకార్యాలకు సుముహూర్తాలున్నాయి.

### మార్చి తిథులు

ఫాల్గుణ శుద్ధ

తేది 18 శని త్రయోదశి ప 12.30 గం.వ
తేది 19 ఆది చతుర్దశి ప 11.00 గం.వ
తేది 20 సోమ పూర్ణిమ ఉ 9.55 గం.వ

ఫాల్గుణ బహుళ

తేది 21 మంగళ పాడ్యమి ఉ 9.20 గం.వ
తేది 22 బుధ విదియ ఉ 9.06 గం.వ
తేది 23 గురు తదియ ఉ 9.36 గం.వ
తేది 24 శుక్ర చతుర్థి ఉ 10.30 గం.వ

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.,**

## వృశ్చికం
(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థికస్థితి బాగుంటుంది. కాని వారాం తంలో అనుకోని ఖర్చులుంటాయి. సోదరుల వల్లగాని, స్త్రీల వల్లగాని, తగాదాలు రావచ్చును. బిడ్డలకు అనారోగ్యం సరిగా ఉండదు. స్థిరాస్తుల మీద రాబడి ఉంటుంది. బంధువుల రాకపోక లుంటాయి. వ్యాపార రంగంలో అభివృద్ధి అవకాశాలు బాగున్నాయి. విద్యాప్రగతి సంతృప్తి కరంగా ఉంటుంది. ఇతరులకు ధనసహాయం చేస్తారు. సాంస్కృతిక, రాజకీయ రంగాలలో పలుకుబడి పెరుగుతుంది.

## ధనుస్సు
(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఆర్థిక పరిస్థితి బాగుంటుంది. కొత్త వ్యాపార, వ్యవసాయ ఆలోచనలు ఉంటాయి. కుటుంబ సౌఖ్యం, సొంత పనులు నెరవేర్చుకొనగల సమర్థత, అధికారులతో స్నేహం ఉంటుంది. విద్యార్థులు బాగా ప్రగతిని సాధిస్తారు. రావలసిన బాకీలు, పెండింగ్ వ్యవహారాల పరిష్కారం జరుగుతుంది. శుభకార్యాలలో పాల్గొనడం, శుభవార్తలు వినడం జరుగుతుంది. ఉద్యోగులకు గుర్తింపు, గౌరవాలు బాగుంటాయి.

## మకరం
(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

రావలసిన బాకీలు లభించడం, సమయా నికి సహాయం అందడం జరుగుతుంది. సొంత పనులు జరగడంలో జాప్యం, మానసికాందోళన ఉంటుంది. కుటుంబ వ్యక్తులతో వివాదా లుండవచ్చును. ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. విద్యార్థుల కృషి కూడా సామాన్యంగా ఉంటుంది. వారాంతంలో శుభ కార్యాలలో పాల్గొనడం, కొత్త పరిచయాలు, ఉద్యోగావకాశాలు రావడం జరుగుతుంది. దూర ప్రాంతాల నుండి ఆహ్వానాలు, ఉద్యోగ విధి నిర్వహణలో శ్రమ ఉంటుంది.

## కుంభం
(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఆర్థికస్థితి బాగుంటుంది. రావలసిన బాకీలు పొందడం, స్థిరాస్తులపై ఆదాయం బాగుంటుంది. శిరస్సు, నేత్ర రుగ్మతలుండ వచ్చును. విద్యాప్రగతి బాగుంటుంది. సొంత పనులు సమర్థవంతంగా పూర్తి చేస్తారు. ఉద్యోగ నిర్వహణలో అధికారుల సహకారం, గుర్తింపు గౌరవాలు బాగుంటాయి. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. ముఖ్య ఆర్థిక వ్యవహా రాలు పరిష్కారానికి వస్తాయి.

## మీనం
(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. విశేష లాభాలు లభించవు. వ్యాపారవృద్ధి అవకాశాలు చేజారిపోతాయి. విద్యాప్రగతి బాగుంటుంది. కుటుంబ సభ్యులకు అనారో గ్యం ఉంటుంది. బలహీనత, జ్వరాది అనా రోగ్యం మీకు కలుగవచ్చును. ఇతరులకు ఆర్థికంగా సహాయపడతారు. దైవ కార్యాలకు, గృహ, వాహన రిపేర్లకు ఖర్చులు ఎక్కువ కాగలవు. అధికార నిర్వహణలో జాగ్రత్త పడాలి. కోపం ఎక్కువై ప్రశాంతత తగ్గుతుంది. శుభకార్యాలలో పాల్గొంటారు. వివాదాలకు దూరంగా ఉండండి. సాహిత్య, సాంస్కృతిక రంగాల వారికి సామాన్యంగా ఉంటుంది.

# జనవాణి

3వ పేజీ తరువాయి

మన రాజకీయ పక్షాలు ఖండించడం లేదు. ఇటీవల ఒక సమావేశంలో క్లింటన్ మాట్లాడుతూ దక్షిణాసియా ఏ క్షణంలోనైనా పేలేందుకు సిద్ధంగా వున్న బాంబు లాంటి ప్రాంతమని, అందులో కాశ్మీర్ వాస్తవాధీన రేఖ మరింత కలవరం కల్గించే విషయమని లేనిపోని భయాలు ప్రపంచానికి కల్గించే ప్రయత్నం చేశారు. ఈ భయాల మాటున ఇండియా - పాకిస్తాన్ వ్యవహారాల్లో తలదూర్చి తీర్పు చెప్పాలని క్లింటన్ ఉబలాట పడుతున్నట్లున్నారు.

నెల్లూరు వి. సూర్యనారాయణ

## దేశీయ పరిశ్రమల సంగతేమిటి?

60ఏళ్ల క్రితం విదేశీ వస్తువులన్నా, పాలకులన్నా, మన దేశస్థులు నిప్పులు చెరిగేవాళ్లు. కాని గ్లోబలైజేషన్ పుణ్యమా అని విదేశీ వస్తువుల మోజుల పడి కొట్టుక పోతున్నారు. గ్లోబలైజేషన్ అంటే మన పరిశ్రమలను మూసేసి విదేశీ పరిశ్రమలకు పెద్దపీట వేయమని ఎవరు చెప్పారో అర్థం కావడం లేదు. గ్లోబలైజేషన్ అంటే దేశీయ పరిశ్రమలను కూడా అంతర్జాతీయ కంపెనీలకు ధీటుగా నిలబెట్టడం. క్విట్ ఇండియా, విదేశీ వస్తువుల బహిష్కరణ స్ఫూర్తిని, గాంధీ సిద్ధాంతాలను దేశ నేతలు ఏనాడో మర్చిపోయారు. విదేశీ కంపెనీలు ఇస్తున్న లాభాలను పుచ్చుకొని వారికి అనుకూలంగా నాయకులు తమ నిర్ణయాలు తీసుకొంటున్నారు.

నెల్లూరు కె. ప్రసన్న

## కాంగ్రెస్‌లో సభ్యత్వానికి విలువేదీ?

ఇది వరలో కాంగ్రెస్ సభ్యత్వమంటే ఒక హోదా క్రింద వుండేది. ఇప్పుడు అది కనుమరుగయ్యింది. వచ్చిన పుస్తకాలు గ్రూపుల వారీగా పంచుకొని, ఏవో పేర్లు వ్రాసి సభ్యులను చేర్చినట్లు డబ్బులు కట్టేస్తున్నారు. అంత వరకు సరే అనుకొన్నా, ఏదైన ఎన్నికల సమయంలో టిక్కెట్ల పంపకం వచ్చేసరికి ఆయా వ్యక్తులకు కాంగ్రెస్‌తో సంబంధాలు విచారించకుండా పార్టీకి వారు చేసిన సేవలు గుర్తించకుండా పార్టీలో సభ్యత్వం లేనివాళ్లకు సైతం టిక్కెట్లు ఇస్తున్నారు. మాజీ ఎమ్పీలు పద్మశ్రీ, పనబాక లక్ష్మి, నిన్నటి ఎన్నికల్లో మునిసిపల్ ఛైర్మన్‌గా పోటీ చేసిన డాక్టర్ యశోధరలు ఈ కోవకు చెందినవారే. పార్టీలో సభ్యత్వానికి విలువలేనప్పుడు సభ్యత్వం స్వీకరించడం అనవసరం.

నెల్లూరు బి.వి. నారాయణ

## లోక్‌సభ సమయం వృధా

లోక్‌సభ సమావేశాలు మొదల య్యాయిగాని గతవారం రోజులుగా సభలో ఎటువంటి చర్చలు జరగలేదు. గుజరాత్ ప్రభుత్వం ఆర్ఎస్ఎస్ వ్యవహారంలో తీసుకొన్న నిర్ణయంపై ప్రభుత్వాన్ని నిలదీస్తూ ప్రతిపక్షాలు సభను స్తంభింప జేశాయి. ఈ అంశంపై ఈ విధంగా నిరసనను తెలియ జేయాల్సిన అవసరం లేదు. ఒక రోజు సభా కార్యక్రమాలు స్తంభిస్తే లక్షలాది రూపా యల ప్రజాధనం వృధా అవుతుంది. ఈ విషయాన్ని రాజకీయ పార్టీలు అర్థం చేసుకొంటే బాగుంటుంది.

నెల్లూరు గునుపాటి వేణుగోపాల్

## 50 ఏళ్ల క్రితం

3వ పేజీ తరువాయి

రైతులు చాలా బాధపడుచున్నారు. గాన ప్రభుత్వంవారు దయవుంచి వెంకటగిరి తాలూకాలోని చెర్వులు, వరవ కాల్వలు విరివిగా రిపేర్లకు యెస్టిమేషన్‌లు తయారు చేసి పనులు ప్రారంభించిన యెడల కూలీలకు కూలి చిక్కి జీవించడమే కాకుండా పై సంవత్సరమునకు ఫలింపుకు జలాధారములు కొంత వరకు వుపయోగపడి అధికాహారోత్పత్తికి దోహదం కాగలవు. ప్రభుత్వం వారు ఎండిపోయిన గ్రామాదులకు సుక్తి రిమిషన్ యిప్పించి, రాబోయే సంవత్సరమునకు చిన్న రైతులకు విత్తనములు కొనుటకు తక్కావి ఋణములు యిప్పించి సహాయపడవలసినదిగా ప్రభుత్వం వారిని ప్రార్థించు చున్నాము.

-గుజ్జలపూడి వెంకటసుబ్బానాయుడు
అధ్యక్షుడు, నె.జి.వ.సం॥

## నెల్లూరు ముచ్చట్లు

### ఆత్మకూరు కాల్పులు

కలెక్టరు, డియస్పి యిద్దరూ పోయి విచారించి, తిరుగా 27తేది వస్తామని చెప్పివచ్చారట. ఎ.డి.యస్.పి., సర్కిల్ యిన్స్‌పెక్టర్లు అచ్చటే మకాం వేసి విచారిస్తున్నారట. పరారీ అయివుండిన డ్రామా కంట్రాక్టరు హనీఫ్ 11తేది ఆత్మకూరులో ప్రత్యక్షమయ్యాడని, అతను, మరిద్దరి వద్ద పూచీ తీసుకొని పోలీసు అతన్ని వదలిందని తెలుస్తున్నది. సబ్‌యిన్స్‌పెక్టర్ నరసింహారావు ఏ.డి.ఎస్.పికి ఒక స్టేటుమెంటు యిచ్చాడని అందులో యీ దుస్సంఘటన వివరాలు తంతుల ద్వారా అందరకు తెలియజేసిన తాలూకా కాంగ్రెస్ కార్యదర్శి చిన్ని వెంకట సుబ్బయ్యను పిలిచి విచారించి, అతను కమ్యూనిస్టయినట్లు సబ్‌యిన్స్‌పెక్టరు స్టేట్‌మెంటు యిచ్చాడని, అది రుజువైతే, అరెస్టు చేయవలసి వస్తుందని హెచ్చరించి నట్లుకూడా తెలుస్తున్నది.

**జూనియర్ సివిల్ జడ్జి కోర్టు, ఆత్మకూరు**

O.S. No. 134/99

పినాకిని గ్రామీణ బ్యాంక్, మర్రిపాడు, శ/శ్రీ బ్రాంచి మేనేజరు - వాది

Vs.

(1) వర్లపల్లి రమణయ్య s/o రామయ్య, చిలకపాడు గ్రామం, మర్రిపాడు మండలం, నెల్లూరు జిల్లా, (2) బొర్రా సుబ్బారెడ్డి - ప్రతివాదులు

పై వాది నీవు తీసుకున్న లోను బాకీ వసూలు నిమిత్తం పై దావా పై కోర్టులో దాఖలు చేసి యున్నాడు. సదరు దావా నీకు నోటీసు నిమిత్తం 30.3.2000 తేది వాయిదా వేసి యున్నది. ఆ రోజు ఉదయం 10.30 గంటలకు నీవు కాని, నీ తరపు వకీలు గాని పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెలుపుతో వలసినది. లేనంతట నీ మీద ఎక్స్‌పార్టీ తీర్మానం జరుగును.

**యం. కామేశ్వర రావు,**
బి.ఎస్‌సి.,బి.ఎల్.
వాది తరపు అడ్వకేటు, ఆత్మకూరు

# నేతలరాతలు

2వ పేజీ కొరవ

277; పామంజి అబ్రహం ప్రసాద్ (ఇండి) 274; బట్టా జయప్రకాష్ రావు (ఇండి) 4; వేల్పుల సాగర్ (ఇండి) 708. మెజార్టీ: 316.

## 20వ వార్డు

మొత్తం ఓట్లు : 8,670
పోలైనవి : 5,288
చెల్లనివి : 135

**K.V. స్వామి నాయుడు (దేశం) 2,104**

మేకల నరేంద్రరెడ్డి (కాంగ్రెస్) 1,722; మాదాల వెంకటేశ్వర్లు (సిపిఎం) 1,307; వారణ్ణ నాగరాజా (ఇండి) 20. మెజార్టీ: 382

## 21వ వార్డు

మొత్తం ఓట్లు : 10,317

**పన్నపరెడ్డి కమలమ్మ (కాంగ్రెస్) 1,760**

భీమినేని నాగభూషమ్మ (బిజెపి) 1,620; భువనగిరి జ్యోతి (ఇండి) 1,005 గోర్లకొండ విజయమ్మ (ఇండి) 15; మొగరాళ్ల కమలమ్మ (ఇండి) 7; యేటూరి కమలావతమ్మ (ఇండి) 3 మెజార్టీ : 140

## 22వ వార్డు

మొత్తం ఓట్లు : 8,870
పోలైనవి : 3,994
చెల్లనివి : 148

**షేక్ దిల్‌షాద్ (సిపిఎం) 1,399**

కంచి సుజాతమ్మ (కాంగ్రెస్) 1,052; గుద్దేటి విజయలక్ష్మి (దేశం) 1,041; ఈపూరు ప్రమీలమ్మ (ఇండి) 4; ఉదయగిరి సుగుణమ్మ (ఇండి) 335; కొండేటి పెంచలమ్మ (ఇండి) 11; పఠాన్ ఖాజాబీ (ఇండి) 1; షేక్ ఖాసింబీ (ఇండి) 3. మెజార్టీ: 347

## 23వ వార్డు

మొత్తం ఓట్లు 8,160

**మండల ఈశ్వరయ్య (బిజెపి) 1,733**

మెట్టు శివకుమార్ (కాంగ్రెస్) 1,536 మెజార్టీ : 197

## 24వ వార్డు

మొత్తం ఓట్లు : 6,960
పోలైనవి : 2,807
చెల్లనివి : 49

**K. సునందనమ్మ (కాంగ్రెస్) 1,708**

మల్లు అమరావతి (దేశం) 1,050 మెజార్టీ 658

## 25వ వార్డు

మొత్తం ఓట్లు : 6,480
పోలైనవి : 2,818
చెల్లనివి : 58

**మవ్వా రమణయ్య (దేశం) 1,190**

కొమరగిరి జానకిరామయ్య (కాంగ్రెస్) 1,006; కాకు సుబ్బారావు (ఇండి) 546; కామంచి వెంకయ్య (ఇండి) 6; చలంచర్ల సురేష్ బాబు (ఇండి) 4; పాలకీర్తి శ్రీనివాసులు (ఇండి) 8. మెజార్టీ : 184

## 26వ వార్డు

మొత్తం ఓట్లు : 4,580
పోలైనవి : 2,639
చెల్లనివి : 53

**తలారి బాలసుధాకర్ (కాంగ్రెస్) 1,272**

బొమ్మిరెడ్డి బాలచిన్నయ్య (బిజెపి) 1,212; అరవ సునీల్ కుమార్ (ఇండి) 3; గుర్రం ప్రభాకర రావు (ఇండి) 6; పులాగ రవికుమార్ (ఇండి) 5; బెల్లంకొండ పాపయ్య (ఇండి) 13; బెల్లంకొండ రామకృష్ణ (ఇండి) 70; మద్దా బర్న బోస్ (ఇండి) 3; యేనాటి విజయకుమార్ (ఇండి) 2. మెజార్టీ 60

## 27వ వార్డు

మొత్తం ఓట్లు : 4,580
పోలైనవి : 2,448
చెల్లనివి : 30

నూనె మల్లికార్జునం (దేశం) 1,330

వాట్ల నరసింహా రావు (కాంగ్రెస్) 1,074; పురందూరు సురేంద్ర బాబు (ఇండి) 4; గంగుల భూషణరావు (ఇండి) 1; సుందూరు ఆల్బర్ట్ ఐరెన్స్ జార్జి (ఇండి) 49. మెజార్టీ 256

## 28వ వార్డు

మొత్తం ఓట్లు : 5,170

**కందుకూరు భువనేశ్వరి (దేశం) 1,297**

పలమాల మంజుల (కాంగ్రెస్) 943 మెజార్టీ 354

## 29వ వార్డు

మొత్తం ఓట్లు : 4,090
పోలైన ఓట్లు : 1,808
చెల్లనివి : 30

**నాపూరు శాంతమ్మ (కాంగ్రెస్) 717**

అరిగెల రామమ్మ (సిపిఎం) 621; గాదం సరోజనమ్మ (దేశం) 409; ఇట్టా జీవలతమ్మ (ఇండి) 31. మెజార్టీ : 96

## 30వ వార్డు

మొత్తం ఓట్లు : 5,880
పోలైనవి : 1,907
చెల్లనివి : 49

**కందల అనిత (కాంగ్రెస్) 975**

బత్తల స్వరూపమ్మ (దేశం) 680; గోర్ల కామేశ్వరి (ఇండి) 63; దాసి అన్నపూర్ణమ్మ (ఇండి) 140. మెజార్టీ : 295

## 31వ వార్డు

మొత్తం ఓట్లు : 4,420
పోలైనవి : 2,243
చెల్లనివి : 56

**పులిమి శైలజ (కాంగ్రెస్) 955**

కరణం సుభాషిణి (బిజెపి) 755; తెప్పల మంజుల (ఇండి) 477. మెజార్టీ : 200

## 32వ వార్డు

మొత్తం ఓట్లు : 3,010
పోలైనవి : 1,687
చెల్లనివి : 28

**డాక్టర్ PSRK మూర్తి (కాంగ్రెస్) 926**

కొత్త వెంకట సుబ్రహ్మణ్యం (బిజెపి) 456; ఎద్దల సతీష్ రెడ్డి (ఇండి) 268; కామంచి వెంకయ్య (ఇండి) 9. మెజార్టీ : 470

## 33వ వార్డు

మొత్తం ఓట్లు : 3,820

**J. శమంతకమణి (దేశం) 1,102**

బెల్లపు ఇందిరమ్మ (కాంగ్రెస్) 908; తలమర్ల యశోధరమ్మ (ఇండి) 12; తలమర్ల శ్రీదేవమ్మ (ఇండి) 12. మెజార్టీ : 194

## 34వ వార్డు

మొత్తం ఓట్లు : 4,970
పోలైనవి : 2,384
చెల్లనివి : 36

**పుట్టా రామకృష్ణారెడ్డి (కాంగ్రెస్) 929**

వేలూరు సుబ్బారావు (దేశం) 784; ముప్పల రాంబాబు (ఇండి) 624; కార్య పార్థసారథి (ఇండి) 1. మెజార్టీ : 145

## 35వ వార్డు

మొత్తం ఓట్లు : 5,470
పోలైనవి : 2,694
చెల్లనివి : 87

**షేక్ సల్మాబషీర్ (కాంగ్రెస్) 1,246**

పంపాద్ మొగల్ (దేశం) 484; మాదంనేని లక్ష్మమ్మ (ఇండి) 369; పఠాన్ ముంతాజ్ బేగం (ఇండి) 23; షేక్ జులేఖా (ఇండి) 572. మెజార్టీ : 674

## 36వ వార్డు

మొత్తం ఓట్లు : 5,180

**షేక్ షఫీ (కాంగ్రెస్) 1,742**

షేక్ న్యామతుల్లా (దేశం) 852; షేక్ జకీర్ (ఇండి) 11. మెజార్టీ : 890

## 37వ వార్డు

మొత్తం ఓట్లు : 4,820
పోలైనవి : 2,563
చెల్లనివి : 66

**Y.P. నరసింహులు (కాంగ్రెస్) 990**

గుమ్మడివూండి శ్రీనివాసాచారి (దేశం) 603; వేలూరు చిన పెంచలయ్య (ఇండి) 926; వేలూరు ఉమా మహేష్ (ఇండి) 27; తంజావూరు సుబ్బరామయ్య (ఇండి) 4; షేక్ ఇక్బాల్ బాషా (ఇండి) 4; అరణి జయశంకరాచారి (ఇండి) 9. మెజార్టీ : 64

## 38వ వార్డు

మొత్తం ఓట్లు : 4,890
పోలైనవి : 2,716
చెల్లనివి : 55

**ధర్మవరపు సుబ్బారావు (దేశం) 1,114**

గార్లపాటి విజయకుమార్ (కాంగ్రెస్) 549; పార్లకొండ ఆనందాచారి (ఇండి) 519; పేరూరి మల్లికార్జున రావు (ఇండి) 13; ముప్పసాని శ్రీనివాసులు (ఇండి) 521. మెజార్టీ : 565

## 39వ వార్డు

మొత్తం ఓట్లు : 5,760
పోలైనవి : 3,254
చెల్లనివి : 86

**Sd. సందాని బాషా (కాంగ్రెస్) 1,888**

నాపూరు ప్రభాకర రెడ్డి (దేశం) 1,251; దోనపర్తి చంద్రశేఖర్ (ఇండి) 48; పడవల చిన్న నారాయణ (ఇండి) 26; బళ్లారి నాగమణి (ఇండి) 37; సయ్యద్ కాలేషా (ఇండి) 4. మెజార్టీ : 637

## 40వ వార్డు

మొత్తం ఓట్లు : 4,140
పోలైనవి : 2,642
చెల్లనివి : 78

**పెనుబల్లి చంద్రశేఖర్ రెడ్డి (సిపిఎం) 1,125**

షేక్ మున్నా (కాంగ్రెస్) 643; కప్పిర శ్రీనివాసులు (బిజెపి) 845; కోడూరు మధుసూదన రావు (ఇండి) 10; తాతినేని క్రిష్ణ (ఇండి) 8; షేక్ మహబూబ్ బాషా (ఇండి) 11. మెజార్టీ : 280

## 41వ వార్డు

మొత్తం ఓట్లు : 5,770
పోలైనవి : 3,055
చెల్లనివి : 104

**దువ్వూరు అరుణ (బిజెపి) 998**

కంచి కామేశ్వరి (కాంగ్రెస్) 818; పగడాల లక్ష్మమ్మ (సిపిఎం) 392; ఇట్టా బుజ్జమ్మ (ఇండి) 732; మనుబోలు పద్మావతి (ఇండి) 11. మెజార్టీ : 180

## 42వ వార్డు

మొత్తం ఓట్లు : 4,500
పోలైనవి : 2,903
చెల్లనివి : 34



డాక్టర్ సర్వారెడ్డి వెంకురెడ్డి కుమార్తె డాక్టర్ పద్మజ, శివమూర్తి రెడ్డియార్ కుమారుడు డాక్టర్ సిద్ధార్థ వివాహం ఫిబ్రవరి 10 తేది నెల్లూరు సోమిశెట్టి వారి కళ్యాణ మండపంలో జరిగింది.

**దారా జయరాజ్ (దేశం) 1,778**

నవకోటి నరసారావు (కాంగ్రెస్) 1,121; జంగిలాల అర్జున్ (ఇండి) 4. మెజార్టీ:657

## 43వ వార్డు

మొత్తం ఓట్లు : 4,350
పోలైనవి : 2,037
చెల్లనివి : 22

**V. నాగేశ్వర రావు (కాంగ్రెస్) 891**

యస్ హైదర్ అలీ (దేశం) 868; వెంకటాచలం దొరస్వామి (ఇండి) 497; వంగ క్రిష్ణకుమారి (ఇండి) 31; కోసూరు పరంధా మయ్య (ఇండి) 4; ఉడతా మణి (ఇండి) 7; అల్లీపురం రాధాకృష్ణయ్య (ఇండి) 1. మెజార్టీ : 23

## 44వ వార్డు

మొత్తం ఓట్లు : 6,890

**షేక్ చాంద్‌బాషా (సిపిఎం) 1,131**

ఉడతా వెంకట్రావు (కాంగ్రెస్) 1,001; సంక్రాంతి కళ్యాణ్ యాదవ్ (దేశం) 1,027; పిగిలాం నాగేంద్ర రావు (ఇండి) 7; రాయ సురేష్ బాబు (ఇండి) 320. మెజార్టీ 104

# చిత్రసమీక్ష

9వ పేజీ కొరవ

కృష్ణ, జయప్రకాష్, సౌందర్యలు వారి నటనా సామర్థ్యాన్ని చక్కగా ప్రదర్శించలేక పోయారు. మిగతా నటీనటులను గురించి చెప్పనవసరం లేదు.

ప్రసాద్ ఫోటోగ్రఫీలో ప్రత్యేకత కనిపించదు. పోసాని కృష్ణమురళి మాటలు కొన్ని బాగున్నా, "స్వాతంత్ర్యం అంటే ఏ పాకిస్తాను వాడో వచ్చి మా అమ్మ పక్కలో పడుకోకుండా, మా నాయనే మా అమ్మ పక్కలో పడుకోవటం" అని కార్గిల్ వారధి చేత చెప్పించటం; ఇలాంటివి చిత్రంలో అక్కడక్కడా వినిపించేట్టు చెయ్యటం చాలా తప్పు అనిపిస్తుంది. ఈ మూకుమ్మడి దౌర్బాగ్యానికి సరళికి దర్శకుడు బి.గోపాల్ బాధ్యుడు.

# సినిమా

9వ పేజీ కొరవ

రంగాల్లో పరిశోధనలు చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలాయన. హెలికాప్టర్‌ను, తొలియుద్ధ నౌకను కూడా రూపొందించారాయన. ఆయనలాగే పలు రంగాల్లో ప్రవేశించాలని, ఏ పని చేసినా అంకిత భావంతో చేయాలని లియొనార్డో నుంచి తాను నేర్చుకొన్నట్లు వివరించారు.

# జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

చంద్రమోహన్‌రెడ్డి, జడ్‌పిటిసి రవీంద్రరెడ్డి కృష్ణారావులు ఈ రోడ్డు పని ఎందుకు పరిశీలించలేదో అర్థం కావటం లేదు.

# మండలాధ్యక్షునికి ఘన సన్మానం

గండుకూరుపేట మండలాధ్యక్షుడు కైలాసం ఆదిశేషారెడ్డిని, ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డిని, జడ్‌పిటిసి శివకుమార్‌రెడ్డిని మండల సిబ్బంది మంగళవారం ఘనంగా సన్మానించారు. మండల పరిషత్ సూపరింటెండెంట్ బూదూరు శ్రీనివాసులు, వ్యవసాయ శాఖ సహాయ సంచాలకులు దశరథరామిరెడ్డి ఆధ్వర్యంలో నిర్వహించిన కార్యక్రమంలో ఐదు సంవత్సరాలలో ఆదిశేషారెడ్డి కార్య దక్షతను వక్తలు కొనియాడారు. సోమిరెడ్డి తన ప్రసంగంలో ప్రజాప్రతినిధులు అవిశ్రాంతంగా తమ సేవలు కొనసాగించాలన్నారు. కార్యక్రమం చివరన కొమరిక ఉపసర్పంచ్ గూడూరు ప్రభాకరరెడ్డి వేదికపైనున్న నాయకులకు సన్మానం చేస్తుండగా ఎమ్మెల్యే చంద్రమోహన్‌రెడ్డి మందిరం కాళ్లకు బంధమా అంటూ చమత్కరించి సభ నుంచి నిష్క్రమించడం సభికులలో గుసగుసలు రేపాయి.

# రెవిన్యూ స్టాంపుల కొరత

మైపాడు గ్రామీణ ప్రాంతాలలో రెవిన్యూ బిళ్లల కొరత తీవ్రంగా వుంది. 15, 10 పైసల స్టాంపులు నప్పి అతికించకపోవడంతో ప్రజలు ఇబ్బంది పడుతున్నారు. పాత స్టాంపులు అమ్మకోను పోస్టల్ అధికారులు రూపాయి స్టాంపులు బయటకు తీయడం లేదు.

* * *



# కృతజ్ఞతలు

ప్రముఖ కంటి వైద్య నిపుణులు

డాక్టర్ ఐ. శివప్రతాప్‌రెడ్డి గారి



# లలిత ఐ హాస్పిటల్

(15/246, బృందావనం, నెల్లూరు)

అత్యంత ఆధునిక వసతులతో
విశాలమైన నూతన భవనంలో
మార్చి 12వ తేది ఆదివారం
ఉదయం 11 గంటలకు
ప్రారంభించబడినది.

ప్రారంభకులు
**శ్రీ ఆదాల ప్రభాకర రెడ్డిగారు**
ఆంధ్రప్రదేశ్ గృహనిర్మాణ శాఖామాత్యులు

ఓ.పి. విభాగం ప్రారంభకులు
**శ్రీ ఆనం వివేకానంద రెడ్డి గారు**
నెల్లూరు శాసనసభ్యులు

ఇన్‌పేషంట్ విభాగం ప్రారంభకులు
**శ్రీ ఆనం రామనారాయణ రెడ్డి గారు**
రాపూరు శాసనసభ్యులు

థియేటర్ కాంప్లెక్స్ ప్రారంభకులు
**డా॥ కె. రవీంద్రనాథ్, M.S., F.R.C.S., గారు**
మేనేజింగ్ డైరెక్టర్, గ్లోబల్ హాస్పిటల్, హైదరాబాదు

## FACILITIES AVAILABLE

I.O.L. SURGERY
OPHTHALMIC 'A' SCANNING WITH PACHYMETRY
ND. YAG LASER TREATMENT
GLAUCOMA SURGERY
SQUINT SURGERY
CONTACT LENS FITTING
PHACO SURGERY
*(sutureless technique for cataract extraction & I.O.L. Implantation)*

ప్రారంభోత్సవానికి విచ్చేసి జయప్రదం చేసిన సహ డాక్టర్లకు, మిత్రులకు, శ్రేయోభిలాషులకు హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాము.

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Ph: 091-861-327354. Offset Printing at Zamin Ryot Press, Nellore